# "అదృష్టహీనుడు"

రచయిత :

ఎం. మునిరామయ్య.

వెల 50 నయాపైసలు

ప్రథమముద్రణము ౧౯౫౮ మూల్యం 50 N. P.

ప్రతులు 1000

ఈ చిన్నపుస్తకమునకు ధనసహాయముచేసి, నన్ను మొట్టమొదటిసారిగ ఆంధ్రప్రజలకు పరిచయము చేసినవారికి నా వినమ్రత నమస్కృతులు. ఈ పుస్తకమును చదివి అమూల్యమైన అభిప్రాయములొసగిన నా వుపాధ్యాయులకు సర్వదా కృతజ్ఞుడను.

ఆంధ్రప్రజలు యీ పుస్తకమును ఆదరించుదురని ఆశించుచున్నాను.

ఇట్లు,

రచయిత.

# అభిప్రాయములు

శ్రీ మునిరామయ్య యువకుడు. ఉత్సాహవంతుడు. చిన్నతనాననే రచనకు పూనుకొన్న బుద్ధిశాలి. ఇతని రచనల రెండింటిని సాంతముగా చదివినాను. ఇప్పటి సమస్యలన్నీ ఇతని రచనలో ప్రతిబింబించుచున్నవి. ఈ యువకవి చక్కని ఆశయాలు గలవాడని తన అనుభవమే చాటుచున్నది. మున్ముందితడు ఇతోధికమైన సారస్వతసేవ జేసి లోకుల అభినందనాలకు పాత్రుడు గాగలడని ఆశింతును.

తిరుపతి, ఇట్లు,

10-10-58 సదాశివ రెడ్డి

---

మానవజీవితాన్ని ఒక మధుర స్వప్నంగా చిత్రించడం బాలకవుల రచనలలో సామాన్యంగా కనిపిస్తుంది. కాని బ్రతుకులోని ఒడుదుడుకులకు, పరిస్థితుల ప్రభావాలకు దాసులై కుమిలే అనాధుల విషాదగాధలు బాలకవుల భావాలకే అతీతంగావుంటుంది. కాని ప్రస్తుత రచయిత బాలుడైనా బ్రతుకులోని బరువును బాగా చిత్రించాడు. ఇది తొలి రచన కావడంచేత కధాసంవిధానం పలచనగా కనిపించినా, పరిశ్రమిస్తే పైకిరాగల ఛాయలున్నాయి. ఆంధ్రాంగ్ల భాషలలోని మహాకవుల రచనలను పఠించి తన రచనా పాటవాన్ని పటిష్టం చేసుకొని సహృదయుల మన్ననలను పొందగలడని ఆశిస్తున్నాను.

తిరుపతి, ఇట్లు,

15-10-58 జయచంద్రా రెడ్డి.

B. A., (Hons.)

వాళ్ళకుటుంబము ఎందుకిలా చితికిపోయింది? వాళ్ళు ఎందుకు అలా చనిపోయారు? అంటే అలా మార్చింది కాల పరిస్థితులు, సంఘపరిస్థితులు, వాళ్ళ యింటిపరిస్థితులు. వాళ్ళకన్నా హీనముగా వుండినవాళ్ళు, బాగా బ్రతుకలేదా! వాళ్ళు సంఘములో గౌరవమును, సౌఖ్యమును పొంద లేదా? నా [illegible] మాత్రము జీవితములో సౌఖ్యమును ఎందుకు పొందలేదు? ఎందుకు సౌఖ్యమైన జీవితమును అనుభవించుటకు నోచుకోలేదు? వాళ్ళను ఎందుకు దౌర్భాగ్యము వెంటాడినది? ఎందుకని పవిత్రదేవత ఎందుకలా హత్యగావింపబడుతుంది, శ్రీకరా ప్రతివాళ్ళు, వాళ్ళ సంసారముపై ఎందుకుపడింది? కారణం మాత్రము వాళ్ళకుకూడా తెలియదు; మనకెంత తెలుసో వాళ్ళకుకూడా అంతే తెలుసు. వాళ్ళుకూడ ఎన్నో ఆశ మేడలు పెట్టుకున్నారు. ఆనందమయమైన, సౌఖ్యదాయకమైన బ్రతుకు బ్రతకాలని వువ్విళ్ళూరారు. కాని వారు అలా జీవించుటకు విధికి మనస్సు ఒప్పలేదు. నాగుపాములాగ పగ పూనాడు. కసిదీర కాటువేసాడు. సంతోషించాడు. కావున యీనాడు యీగతికివచ్చి యీలాంటి చావు చావలసివచ్చింది.

# ఉపోద్ఘాతము:



నవలా రచనలు మన తెలుగు సాహిత్యానికి క్రొత్త గాదు. మానవుల చిత్తవృత్తుల నాధారంగా జేసికొని కథకల్పన జేయడమే నవలలు ముఖ్యోద్దేశం; ఆంగ్లంలో వీటికి గొప్పగా ప్రాధాన్యం ఉంది. అట్టి సాంప్రదాయమే యీ యిరువదవ శతాబ్దిలో పెద్దగా పెరిగింది. చక్కని లోకానుభవం గలిగిన కవియే రచనలు సాగించి లోకాన్ని తనవైపుకు త్రిప్పుకోగలడు. అట్టివారిలో చలం ముఖ్యుడు. ఆయన పుస్తకాలలో కొన్నిటి నైనా చదివియుండని తెలుగువాడుండడు. ఒకప్పుడు కొన్ని చదువరులకు రోతపుట్టించే రచనలుగూడా ఉన్నాయి. అది ఒకతీరు పుస్తకాలు. ఎట్లయిననేమి? సమర్థుండైన కవి ఒకప్పుడమాంతంగా సంఘములో గొప్ప సంచలనం దెచ్చిపెట్టగలడు.

చిరంజీవి మునిరామయ్య రచించిన "అదృష్టహీనులు" రచన లోకానుభవాన్ని చాటుతున్నది. పుస్తకంలో దృష్టిగోచరం అవుతున్న కొన్ని పాత్రలు చదువరుల హృదయాలను ఆర్ద్రీభూతం జేస్తూన్నవి. అదృష్టహీనుల జీవితాలు చక్కగ వర్ణించబడ్డాయి. పుస్తకాన్ని సాంతంగా జదివినప్పుడు ఏదో చెపరాని హృదయ సంచలనం గలుగుతుంది. ఇదియే రచన

గల విశిష్టత. చదువు సాములూ, తెలివి తేటలూ గలిగి వుండికూడ లోకంలో సుఖించలేనివారు ఎందరో ఉన్నారు. నిజమే. అది మందదృష్టమనే చెప్పాలి.

రచయితకు పిన్నవయస్సు. అనుదినమూ తన కన్నులకు గట్టుచున్న కష్టజీవితాన్ని ఆధారంగా జేసికొని రచనకారంభించినాడు. ఒకటి రెండుచోట్ల కథ పలుచబారినా మొత్తంమీద విజయవంతంగా రచనసాగించినాడు. ముందుముందు మరింత అనుభవాన్ని సంపాదించుకొని నిర్దుష్టమైన గ్రంథాలెన్నో సృష్టించ గలడని నే నాశిస్తాను. అట్టి సునిశితమైన శక్తి యీ బాల రచయితలో గలదు. శ్రద్ధాభక్తులు గలవాడు. అందుకుతోడు పట్టుదల. ఇవి రచనాకారులకు కావలసిన గుణసామగ్రి. పాఠకులు ఈ బాలరచయితను ప్రోత్సాహించి, కృతార్థుని చేయుదురుగాక.

ఇట్లు,

బుధవిధేయుడు,

ఎం. సదాశివరెడ్డి

# "అదృష్టహీనులు"

భారతావనిలో యెన్నెన్నో మహాసామ్రాజ్యాలు మహోన్నతముగా, మహోజ్వలముగా కొన్ని కాలాలపాటు ప్రకాశించాయి. ఇప్పుడు మరుగుపడి, శిథిలమయ్యాయి. కాని నాటి సంస్కృతి ఒక చిహ్నముగా నిలిచింది. అదికూడా శిథిలావస్థలోవుంది. అట్లాగనే రాయలకాలమున ఆంధ్రదేశము రత్నాలసీమయని ప్రసిద్ధికెక్కినది. కాలప్రవాహములో రత్నాలన్నీ కొట్టుకొనిపోయి యిప్పుడు పాషాణాలు మిగిలాయి. ఇప్పుడు ఆనాటిసంస్కృతికూడ శిథిలావస్థలోవుంది. అప్పుడు రాయలేలిన రత్నాలసీమలో అందాలరాశిగా ప్రకాశించింది మహాపూరు. కాని యీనాడు దానిముఖమును చూచేవారు లేరు. దానిని బాగుసరిచేవాళ్ళు అంతకుమునుపే లేరు. అక్కడ పుట్టి, పెరిగి, చక్కగా చదువుకొని, సొంతముగాయిండ్లు వున్న వారికికూడ దానిని వృద్ధిలోనికి తీసుకొనివచ్చుటకు, పూను కొనుటలేదు. "దేశము ప్రేమింపుమన్నా"! అన్నాడు మన గురజాడ అప్పారావుగారు. అది పూర్తిగా మరచిపోయారు.

ఇది మానవునికి సహజగుణంగా మారింది. ఇప్పటి కాల మహిమఅనాలి. ఇప్పుడు కన్నతల్లిని, తండ్రిని ఆదరించక మరచిపోతారు. అట్లాగే జన్మభూమినిగూడ మరచిపోయారు. అంతే దానిమీద శ్రద్ధతీసుకోలేదు. ఇప్పుడు మావూరికిపోతే మొండిగోడలు స్వాగతమిస్తాయి. కొన్నియిండ్లు కుప్పగాకూలి పోయి నేలలో సమసిపోతున్నాయ్. కొన్ని రేపో మాపో, కుప్పగా కూలిపోయే స్థితిలో వున్నాయి. ఇప్పుడు ఆవూరి కంతకు రెండుమూడు వీధులున్నాయి. సారబాఱున ఎవరైన చూచుటకువస్తే యిచ్చట వూరువుండేది అని అనిపించు కొనుటకు, ఇప్పుడు ఆరెండుమూడు వీధులు ఎట్లావున్నాయంటే ఎండిన మ్రోడులో చిట్టచివర రెండుమూడు చిగురాకులు వుండినట్లున్నాయి. ఆవీధిలోకెల్ల మాయిల్లు చాల సంస్కార హీనంగావుంది. గోడలకు వుప్పుపట్టి, మట్టిఅంతా రాలిపోవు చున్నది. ఇంటికప్పుపైన పాముపుట్టల్లాగ చెదలుపుట్టలు పెట్టి వున్నాయి. వాన వచ్చినయెడల అది యిల్లుగా వుండదు. అంతానీ ళ్ళమయమవుతుంది. మాయింటిస్థితి యిలావుంది.

మాది ఒక సాధారణ కుటుంబము. లోకములో కొందఱు మహారాజులుగా జన్మిస్తారు. అది వారి పూర్వ సుకృతమువల్లనో యికదేనివల్లనో నాకు తెలియదు. నామట్టుకు మహారాజులయింటిలో ఎందుకు జన్మించకపోతిమని ఇదివరలో ఆ ఆలోచనేలేదు. కాని సాధారణకుటుంబములో పుట్టామని

చేసు, చింతలేదు. కాని యీనాడు ఎందుకు ధనవంతుల
యింటిలో జన్మించకపోతిమి అనేచింత నాలో యిప్పుడు బయలు
దేరింది. (పుట్టినది). అలా నన్ను మార్చినాయి కాలపరిస్థితుల
కాలప్రవాహములో పరిస్థితులంతా ఒకేమాదిరిగా వుండవ
అది నాకు తెలుసు. బండ్లు ఓడలవచ్చు, మిట్టలు పల్లాలు
మారవచ్చు. మారవచ్చేమిటి మారిపోతూవుంటేః? పనికిరా
ప్రదేశములు మహాపట్టణములు, భీకరారణ్యములు చిట్ట
వులగుచున్నాయ్. ఇది కాలప్రవాహములో జరిగే పరిణామము
ఈనాడు బీదవాడుగా వుండవచ్చు, రేపు ధనవంతుడుగా మా
వచ్చు, ఈనాడు వెన్నెలకాయవచ్చు, కాని రేపు గాఢాం
కారము అలుముకోవచ్చు, నిన్నటి పద్ధతులు రేపటికి రుచింప
కపోవచ్చు. ఈనాటి సిద్ధాంతములు రేపు పనికిరాకపోవచ్చు. ఇ
సంఘములో జరిగే పరిణామము. అట్లే మానవునియొక్క జ
తములో కూడ. కొద్దికాలము బీదతనమును అనుభవిస
ఆకలిమంటలతో అల్లాడిపోతూ, కుమిలి, కృంగి, కృశిం
పోతారు. కొద్దికాలము సంతోషముతో వొళ్ళు తెలియ
విఱ్ఱవీగుతారు. ఇది సహజం. ఒకనాడు మా కుటుంబమ
మేలాటి ఒడుదుడుకులు లేకుండా బాగా, చక్కగా నడిచిం
కాని ఈనాడు బీదతనానికి దాసానుదాసులయ్యాము. ద
చేతిలోని కీలుబొమ్మలయ్యాము. అది ఎలాఆడిస్తే అలా ఆ
వలసినదే! అది ఎలా పాడమంటే అలా పాడవలసినదే! ఈస్థితిల
దానిని ఎదిరించే శక్తినాకు లేదు. అది మనుష్యులను వే

చేస్తుందో మాకు తెలియదు. అది ఏమైనా చేయవచ్చు. దాని చేతిలోవున్నాము. కాబట్టి అదిమమ్మల్ని పిప్పిచేసి, సారాన్ని త్రాగి మమ్ములను వదలిపెట్టవచ్చు. లేక నానురూపాలు లేకుండా చేయవచ్చు. అది అంతా దానియిష్టము. నేను, నీవు యేంచేస్తాము?

ఈనాడు మానాన్నకు జబ్బుపట్టుకుంది. దానితో సతమతమవుతున్నాడు. బాధతో అల్లాడిపోతున్నాడు. ఒక్కసారి యింటిపరిస్థితినిచూచి అతని హృదయం దహించుకొని పోవుచున్నది. అతని మనస్సు ఏదో చెప్పరాని ఆవేదనతో దుఃఖించి, దుఃఖించి, కృశించి, నశించిపోవుచున్నది. గోటి చుట్టుపై రోకటిపోటన్నట్లు వున్నకాస్త వుద్యోగము పోయినది. దానితో మా పరిస్థితి అయోమయముగా మారింది. మా నాన్నకు నేను చెల్లాయి తమ్ముడు వుండేవాళ్ళను. మమ్మలను అల్లారుముద్దుగా పెంచారు. గారాబముగా మంచితిండి తినిపించాడు. కోరినగుడ్డలు కుట్టించాడు. కాని యీనాటి తిండి మాకు తినుటకు చాలకష్టముగానున్నది. నా మీద బోలెడు ఆశలు పెట్టుకున్నారు. కలలో మేడలు కట్టారు. దానిలో విహరించాలని అనుకున్నారు. కాని అవి కుప్పగా కూలిపోయాయ్. నేను అప్పుడు Intermediate చదువు చున్న రోజులవి. మానవుడు విద్యార్థిదశలోని ఆనందము, సౌఖ్యము జీవితములో ఎప్పుడూ పొందలేడు. ఇదిపరమసత్యం.

చదువుచున్న రోజులు ఎంతో హాయిగా, ఉత్సాహముగా గడచి పోయాయి. ఆనాడు బయట మంచముపై పండుకొని, ఏదో ఆలోచిస్తున్నాను. పండు వెన్నెల కాయుచున్నది. నక్షత్రములు చంద్రునిచుట్టు, చుట్టుకొని నవ్వుకుంటూ ఆడుకుంటున్నాయి. వాళ్ళఆటను అప్పుడప్పుడు మబ్బులు అడ్డుతగులు చున్నాయి. చల్లగా, మెల్లగా గాలి వీచుచున్నది. ఒక ప్రక్క రోడ్డులో చిన్నపిల్లలు దాగుడుమూతలు, చెడుగుడులు ఆడు కుంటున్నారు. అచ్చటచ్చట కొందరు ఆడవాళ్ళు గుమిగూడి పుక్కిటి పురాణము చెప్పుకొనుచున్నారు. నేను వీటిసన్నిటిని చూస్తూ పరధ్యానముగావున్నాను అమ్మ నామంచముపై కూర్చొన్నది. నామంచము మాయిద్దరి బరువు తట్టుకోలేక చిన్నచిన్న అఱపులు అరచుటకు పూనుకుంది. అమ్మపైకిలేచి క్రిందకూర్చొని, పిల్లల ఆటలను చూస్తున్నది. నామంచము ఎన్నెన్నో సంవత్సరములు మాకు సేవచేసినది, దాని పసి తనములో ఎందరెందరినో మోసినది. కాని యీనాడు ముదు సలి అయిపోయినది. ఒకరినిమోయుటకు చాలకష్టపడుచున్నది. నేను అలాగే పండుకొని పిల్లల ఆటలను, కొట్లాటలను చూస్తు వున్నాను. ఎవరో అన్నారు రిజల్ట్సువేసారని. గబగబ లేచాను. ఆరాత్రిలోనే బయలుదేరాను. ఇంతవరకు ప్రశాంతముగా వున్న వాతావరణము ఒక్కసారి భీభత్సము దాల్చింది. చంద్రునకు, నక్షత్రములకు ఆటలో కోపతాపములు వచ్చినట్టుగా వుంది. వాళ్ళవాళ్ళ యిండ్లకు అలిగి వెళ్ళిపోయారు. మబ్బులు

ప్రముగా ఆకాశమునంతను కప్పివేసాయి. ఎచ్చట ఆటలు అచ్చట ఆగిపోయాయి. ఇంత వరకు చాల బిజీగావున్న రోడ్డు యిప్పుడు బిక్కు, బిక్కుమంటున్నది. వర్షము గా సన్నగాపడుచున్నది. గాలి హూరున వీస్తున్నది. అప్పుడప్పుడు దుమ్ము, ధూళి ముఖముపై పడుచున్నది. నానలోనే గబ, గబ అంగలు వేసుకుంటు పోతున్నాను. నాముందు, నావెనుక నామాదిరే గసపెట్టుకుంటు జోరులో నడుస్తున్నారు. దగ్గరికి పోనుపోను గుండెదడ ఎక్కువైనది. కళ్ళు చెమర్చుచున్నాయి. నాకన్నా ముందున్న విద్యార్థులు త్రోసుకుంటూ, నొక్కుకుంటూ వాళ్ళ, వాళ్ళ నెంబర్లుకొరకు వెతకుచున్నారు. నేను కూడా నా నెంబరుకొరకు అంతా వెతికాను. కనబడలేదు. నా స్నేహితులుకొందరు పాసయ్యారు. కొందరు తప్పి పోయారు. అంతే, నాలోని ప్రతిర క్తపుబిందుప్ర తినవర్ణమును కోల్పోయింది. మనస్సంతా పాడైపోయినది. ఏదో వికారము జనించినది. పిచ్చివాడులాగ తయారయ్యాను. గబ, గబ వచ్చేశాను. నిరాశతో, నిస్పృహతో యింటికి వస్తున్నాను. గాలిలో నడచినట్లుగావుంది. కాళ్ళు తడబడుచున్నాయి. నామనస్సు నన్ను నిందించుకొంది. నాకర్మ అనుకోవాలి. నా శక్త్యానుసారము ప్రయత్నించాను. రైతు చక్కగా పంటను పెంచుతాడు. రేపో, మాపో కోతకోస్తాడు. అప్పుడు వానవచ్చి నాశనము చేస్తుంది. అతడు యేంచేస్తాడు. యేం చేయుగలడు? నేనుకూడ అంతే? మానవ ప్రయత్నమంతా

చేసాను. దానితోపాటు దైవము నామీద కాస్త కరుణచూపి వుంటే, కాస్త అతను వూతగానిల్చివుంటే, నేను యిలాతప్పి పోవడి వాణ్ణికాను నాయొక్కదృష్టము యిలావుంటే అతను మాత్రము యేంచేస్తాడు? గతాన్ని మరచిపోవాలనుకున్నాను. మరచిపోలేకున్నాను. మరచిపోవుటకు నామనస్సు అంగీకరించుటలేదు. ఇంటికి చేరుకున్నాను. త్రోవలో నామాటవిని అందరు ఆశ్చర్యపోయారు. చింతిల్లారు. ఇంటిలో నామాట అందరికి నిరాశకలిగించింది. అందరికియేదో లోటుకలిగించాను. నాపరిస్థితియిట్లావుంది. ఇంట్లోచూస్తేనా మానాన్నగారి జబ్బు నయముకాలేదు. పనికిమాలిన డాక్టర్ల దగ్గర మంచినీళ్లు తెచ్చుకొని, డబ్బునంతా ధారబోసాము. కాస్తకూడ బాగుకాలేదు. ఇప్పటివరకు రెండుపూటలు పూర్తిగా తింటూవచ్చాము. ఇప్పుడు ఒక్కపూటకు వచ్చింది. ఇంట్లోవున్న సామాన్లుఅమ్మి నాన్నను మందుతీసుకోమన్నాను. నిరాకరించి, కాటికి కాళ్లు చాపినవాడికి యింకా మందుకావాలా! అని మొండి పట్టు కున్నాడు. మాపు మిన్నువిరిగి మీదపడినట్లయింది. ఇట్లా వుంది మాపరిస్థితి. నామీద పెట్టుకొనిన ఆశయాలుబూడిదలో పోసిన పన్నీరులాగ, పొయ్యిపాలైన పాలులాగ అయింది. నేను ఎప్పుడైన వుద్యోగమునకు పోయినపుడెల్ల చుక్కెదురు. నేనిప్పుడు **R. K. Department** లో వున్నాను. మానాన్న పరిస్థితి దిన, దినమునకు దిగజారిపోవుచున్నది, ఇక బ్రతుకుతాడనే ఆశ వదలుకోవలసివచ్చినది. ఇప్పుడు ఒక్కపూట

గడిచేది బ్రహ్మాంతరముగా నున్నది. మేమిప్పుడు చాల విషమ పరిస్థితుల్లోవున్నాము. ఎక్కడికైనా కూలికి పోతామన్నా మనస్సు అంగీకరించుటలేదు. ఇంట్లో చూస్తే ఒకరికికూడ గుడ్డలులేవు లేక, లేక, రాక, రాక సంక్రాంతి వస్తుందని, నవ్యకాంతి తెస్తుందని అందరు చాల సంతోషించుచున్నారు. కాని మాకు మాత్రము సంతోషములేదు. దాని బదులు నిరాశఆవరించివుంది. పొలాలనుండి ధాన్యాలు యిండ్లకు చేరుస్తున్నారు. ఇండ్లను శుభ్రముగా అలంకరించుకొనుచున్నారు. కాని మాయిల్లు ఎప్పటిలాగ చాల సంస్కారహీనముగావుంది. లోపలంతా బూజుపట్టివుంది. రాత్రిపూట యింటికప్పును చూస్తే నక్షత్రములు బాగా కనబడుతవి. ఆ పీనికంతను మాయిల్లు దిష్టిబొమ్మగావుంది. అందరిహృదయాల్లో సంతోషము తాండవిస్తోంది. కాని మా హృదయాల్లో ఆవేదన ముమ్మరముగావుంది. అందరియిండ్లు ఆనందముతో కాంతివంతముగా మెరయుచున్నాయి. మా యింట్లో దుఃఖము గాఢాంధకారము అలుముకొని దారి తెలియక ఒకరినొకరు తెలుసుకొనక అల్లాడిపోతున్నాము. అందరు మంచి, మంచి గుడ్డలతో వీధులలోనికి వస్తున్నారు. అరె వాళ్లు మంచి గుడ్డలు వేసుకున్నారే అనేవుళ్ళు ఎవరికిలేదు. మేము చింపిరి గుడ్డలు వేసుకొనియున్నామే అనే చింతిల్లాము. అంతె. సంక్రాంతి రానే వచ్చింది. ప్రతియిల్లు కళ, కళలాడుచున్నది. ప్రతియింట పసిపిల్లలు, ఆనందముతో కేరింతలు కొట్టున్నారు.

ఈనాటికి మేము యీపరిస్థితిలో నున్నాము. మమ్ములను చూచేనాథుడులేడు. ఆదరించేవాళ్ళు లేరు. మేము బాగా వుంటే అందరు ఆదరించేవాళ్ళే, చేరదీసేవాళ్ళే. కాని యీనాడు మేము బికార్లు అయ్యాము. బెల్లమువుంటె చీమలు చుట్టుకుంటాయి. పిల్లవుంటె కప్పలువస్తాయి. అది నైజగుణం. తమ్ముడు, చెల్లాయి క్రొత్తగుడ్డలు కుట్టించమని రచ్చచేశారు. వాళ్ళకేం తెలుసు యింటిలోని పరిస్థితి. ఆనాడు పాతస్నేహితుడు పదిరూపాయలు బహుమతిగా పంపించాడు. వాళ్ళకు కాస్తయిచ్చి, మిగత యింటిఖర్చులకు సరిపోయినది. అతను నన్ను మరిచిపోకుండా డబ్బు కానుకగా పంపించాడు. అతనికి నేనుకూడ యేదైనా పంపించాలి. ఇంట్లోవున్న మంచి పుస్తకములలో నుంచిది ఒకటి పంపించాను. సంతోషించాను. సంక్రాంతి పండుగ అందరికి పండుగే, కాని మాకు మాత్రము పండుగగా లేక పోయింది. కారణం నానోటితో చెప్పలేక పోతున్నాను. నా మనస్సు దుఃఖముతో అల్లాడిపోతున్నది. ఆనాటి రాత్రి మానాన్న చనిపోయాడు. మమ్ములను శాశ్వతముగా విడనాడిపోయాడు. చనిపోయేముందు చెల్లాయిని, తమ్ముణ్ణి చాల జాగ్రత్తగా చూచుకోమన్నాడు. తల్లిని కష్టపెట్టవద్దన్నాడు. ఇదిచెప్పి చల్లగా కన్నులు మూసాడు. మా యింటిలో ప్రకాశించుచున్న జ్యోతి ఆరిపోయింది. గాఢాంధకారము అలుముకొన్నది. ఆ వేదన మమ్ములను నిండు

కొన్నది. దౌర్భాగ్యము మమ్ములను పూర్తిగా హత్తుకొన్నది. మా కుటుంబమునలిగి, చితికిపోయింది. మేము కన్నతండ్రిని కోల్పోయాము. అమ్మ భర్తను కోల్పోయింది. అటు వంటి తండ్రి మాకిక ముమ్మాటికి దొరకడు.

ఇప్పుడు మా చెల్లాయి, తమ్ముడు III rd form చదువుచున్నారు. వాళ్ళ చదువుకూడ గొడ్డలిపెట్టులాగ తగిలింది. మానాన్నకు రావలసినభాగము మా చిన్నాయన ఎగగొట్టాడు. మానాన్న చనిపోతే అందరు వచ్చారు. కాని చిన్నాయన రాలేదు. ధనమోహములో తన సొంత అన్నను మరచిపోయాడు. అతని హృదయం కరుడుగట్టిన బండ. అతనిలో మానవత్వములేదు. అతనికి భూతదయ అంటే తెలియదు. మాకు రావలసిన కాస్తభాగము యీ కష్టసమయములో యిచ్చివుంటే, యీదౌర్భాగ్యపు బ్రతుకు మను నోచుకోవలసిన పనిలేదు. మమ్ములను యీస్థితిలో కరుణా చూపక యింటినుంచి పొమ్మన్నాడు. మేమువుండే యిల్లు కూడా అతనిదే కాబట్టి. ఖాళీచేయకపోతే గెంటిస్తానన్నాడు. ఈమాట మా హృదయాలను కలవరపెట్టించింది. ఎంతటి నిర్దయుడో యెంతటి కఠిన హృదయము కలవాడో మీరే ఆలోచించి నిర్ణయించండి. ఒకప్రక్క తండ్రిపోయాడని, మరియొకప్రక్క ఆకలిమంటలతో అలమటిస్తూ వుండేవాళ్ళను

మామదగ్గరనుండి జాబు వచ్చింది, తనవూరికి రమ్మని. నేను యెంతో సంతోషించాను. అమ్మకు మాత్రము యిష్టములేదు. అచ్చటికి పోవుటకు కారణం నాకు తెలియదు. ఇచ్చటనే వుండిపోతామని చెప్పింది. ఈనాడు తిరస్కరిస్తే మామ యేమైనా అనుకుంటాడు. ఎంతదయ, ప్రేమలేనిదే తనయింటికి రమ్మని చెప్పతాడు. మేము పోకపోతే అపోహపడవచ్చు, బాధపడవచ్చు. అమ్మతో మరి మరిచెప్పాను. బాబు! మనమీద నాఅన్నకు ప్రేమ లేకపోలేదు. నిజమేకాని, అంగట్లో అంతావుంది, అల్లుడి నోట శనివుంది. మీ అత్తయ్యమాత్రము మనదికాదు. ఈస్థితిలో యీనాడుబోతే నీచముగాచూస్తుంది; అచ్చటికి యిప్పుడు వద్దుబాబు అని నన్ను సమాధానపరచినది, కాని మరల యింకొక జాబు వచ్చింది. ఖచ్చితముగా రావలసినదని ప్రేమతో, వినమ్రతతో తన చెల్లాయికి వ్రాసాడు. అమ్మ మనస్సు మార్చుకుంది. మామయింటికి బయలుదేరాము. మేము పోయినవేళకు సరిగ Train అందినది.

ఆలోచించి, ఆలోచించి బుజ్జి వేడెక్కినది చల్లటి గాలివీస్తున్నది. సూర్యభగవానుడు పడమటికొండలలోనికి షికారుకెళ్తున్నాడు. అతనితోకూడ పక్షులు వెళ్తున్నాయి. పసువులకాపరులు పసువులను తోలుకుంటూ ఆనందముగా పాటలు పాడుకుంటూ, యిండ్లకు వెళ్తున్నారు. పూర్వపు

సంగతులు ఒక్కొక్కటి ప్రవేశించి, మెచ్చుకొని వెళ్ళిపోతు చున్నాయి. తమ్ముడూ, చెల్లాయి అమ్మదగ్గర కూర్చొని కథలు చెప్పుకుంటున్నారు. ఫ్రంట్రూండ్ వాళ్ళ దిక్కు హృదయాల్లో యేదో బయలుదేరింది. అన్నయ్యా! నిన్నేకదూ పిలిచేది? ఎంతసేపు పిలిచినా పలుకవ్రూ! వాళ్లు యెప్పటి నుండి పిలుచుచున్నారో! నాకు మాత్రము వినబడ లేదు. ఇప్పుడు వినబడినది. ఏమిటి చెల్లాయి, నేను అడిగిన ప్రశ్నకు జవాబు చెప్తావుగదూ! అట్లాగే! మనము చదువు నేర్చుకొను చున్నాముగదూ! అది వుద్యోగంకోసరమా! లేక జ్ఞానం కోసరమా! చెప్పన్నయ్యా. మనము చదువుకొనేది జ్ఞానం కొరకు చెల్లాయ్. కాని దాని సహాయంతోకూడ మనము పొట్టను పోషించుకుంటున్నాము. అన్నయ్యా! అన్నయ్యా! ప్రతిదినము న్యూస్‌పేపరులో "లెబనాన్"ను గురించివస్తున్నది. ఏమిటన్నయ్యాఅది. ఈసారి మూడవ ప్రపంచయుద్ధము ప్రపంచయుద్ధము తప్పక వస్తుందని అందరు అనుకుంటున్నారు. అన్నయ్యా! మనదేశమునకుకూడ వస్తుందా యుద్ధము? మన దేశముకూడ యుద్ధములో పాల్గొనవలసినదేనా! చెప్పన్నయ్యా! తమ్ముడూ! అదినీకు చెప్పితే అర్థమవుతుందా? అది నాకే అర్థంకాలేదు. చెప్పన్నయ్యా. చెప్పకుండానే నీకు అర్థము కాదు, నీవు అర్థము చేసుకోలేవు? అని **Chapter Close** చేస్తావు? ఏదో నాకు తెలిసినది చెప్పతాను తమ్ముడూ! "లెబనాన్"కు ఒక అధ్యక్షుడు వుండేవాడు. అతనిపేరు

Chowman. అతడు Dictator వలె పరిపాలించుచు, ప్రజా స్వాతంత్ర్యమునకు స్వస్తిచెప్పి యిష్టమువచ్చినట్లు వ్యవహరించు చుండేవాడు. అతని నిరంకుశత్వపు పరిపాలన, ప్రజలకు అయిష్టము కలిగించింది. ప్రజలందరు అతనిని President పదవికి రాజీనామా యిచ్చి పొమ్మనిరి. అతను బ్రిటన్, అమెరికా చేతులలో కీలుబొమ్మ అగుటచే వాళ్ళ సహాయము లభిస్తుందని [illegible] ప్రజల మాటలను లెక్కచేయలేదు. కాబట్టి విప్లవము లేవదీసారు. మనదేశానికి యుద్ధము రాదులే తమ్ముడా! మనకువేనికి ఆయుధాలు, ఆరక్తపాతాలు. మనకు కావలసినది శాంతి, సౌభాగ్యాలు, ప్రతిఒక్కనికి విద్య, ఆరోగ్యసౌకర్యము కావాలి, యివిలేక తల్లడిల్లి పోతున్నాము. మరియొకప్రక్క నిరుద్యోగసమస్యతో పెనుగులాడుతూ, అతి వృష్టి అనావృష్టి బాధలతో అల్లాడిపోతున్నాము. ఇంకొక ప్రక్క కులమత భేధాలతో, భాషావిభేదాలతో కుమిలి పోతున్నాము. సంఘములోనున్న కుళ్ళు కు తట్టుకోలేక అల్లాడిపోవుచున్న మనదేశానికి యుద్ధము కావాలా! ముమ్మాటికి వద్దు; ఆ యుద్ధాలాడి కోటిమానవులను చంపి, ఎన్నెన్నో సంవత్సరాలనుండి కష్టపడి సంపాదించుకొన్న సంస్కృతి ఒక్కనిమిషములో బూడిదపాలుచేస్తే మనకువచ్చిన లాభమేమిటి? ఫలితము శూన్యం. తమ్ముడూ, చెల్లాయి. మనకు కావలసినది శాంతిసౌభాగ్యము, దీనికొరకే మనదేశము ప్రాకులాడుతున్నది. అదేమనకు మహాత్ముడు బోధించిన

స్తూత్రము. అదేమనకు గమ్యస్థానము.

మరల నా ఆలోచనల్లో మునిగితేలుచున్నాను. మాతృభూమిని విడిచిపెట్టి క్రొత్తవూరికి, క్రొత్తవాతావరణములోనికి పోవుచున్నాము. పాతస్నేహితులను విడనాడి, క్రొత్త స్నేహితులతో యికపరిచయ మేర్పడ్తుంది. మేము యిల్లు వదలినప్పుడు ఎందరెందరో వింతిల్లారు. కష్టపడ్డారు. అందరి కండ్లల్లో నీళ్ళుతిరిగాయి. రైలు పొగలుగ్రక్కుకుంటు అతి వేగముగా పోవుచున్నది. ఇప్పటికి మామయింటికిపోయి సుమారు నాలుగు సంవత్సరము లైనది. కారణం వాళ్ళు మాయింటికిమాత్రము అప్పుడప్పుడు వస్తు, పోతూవుండేవారు. మాచెల్లాయి, తమ్ముడూ అప్పుడప్పుడు వెళ్ళేవారు. నేను మాత్రముపోయి చాలారోజులైనది. మామ చాల ధయార్ద్ర హృదయుడు. సుశీల చాలమంచిది. నామీద చాలా ప్రీతి ఎక్కువ. మామ మమకారముతో చిన్నప్పుడు పెంచాడు. కాని అత్తయ్య జ్ఞాపకమువచ్చింది. అమ్మ ఎందుకు పోనందో దానికి కారణం ఆమె సంకుచిత మనస్తత్వముగలది. ఒకరిని చూస్తే కుళ్ళు. ఆమెపనులు కుతంత్రముతోకూడినవి. దాని వల్లనే అమ్మ యిచ్చటికి వచ్చుటకు జంకినది. రైలు ప్లాట్ ఫారముదగ్గర ఆగింది. రక, రకాల ఆలోచనలతో మామ యింటివైపునకు నడచుచున్నాము. తమ్ముడూ, చెల్లాయి ఆనందముతో పాటలు పాడుకుంటూ నడుస్తున్నారు. అమ్మ

మాత్రము నెమ్మదిగా నడచుచున్నది. ఈనాలుగు సంవత్సరము లలో వూరే పూర్తిగా మారిపోయింది. ఇప్పుడు ఎచ్చట చూచినా బ్రంహాండమైన బిల్డిలు, రెండు మూడు ఫ్యాక్టరీలు, ఒకపెద్ద University తో కళ, కళలాడుచున్నది. ఇప్పుడు ఎప్పుడుచూచిన రోడ్డుచాల ట్రాఫిక్‌తో నిండివుంది. తమ్ముడు, చెల్లాయి పరుగెత్తుకుంటూ మామయింటినిచేరారు. మామయ్య సుశీలమాకు ఘనస్వాగతమిచ్చారు. కాని అత్తయ్య మాత్రము దూరముగావుంది మూతిముడుచుకొని అమ్మముందు పోయి పలుకరించింది. ముక్తసరిగా జవాబిచ్చింది. సుశీల మాత్రము అమ్మకు కావలసిన వస్తువులన్నీ తెచ్చిపెట్టూవుంది. తమ్ముడూ, చెల్లాయ్ సుశీలతో ఆడుకుంటూ, పాడుకుంటూ కాలము వెళ్ళబుచ్చుచున్నారు. అమ్మమాత్రము ఒకమాదిరిగా వుంది. అత్తయ్యమాత్రము మమ్ములను చూచినపుడెల్ల కారాలు, మిరియాలు నూరుచుండెడిది.

మామయ్య ఏదోపనిమీద వూరికి వెళ్ళిపోయాడు. మేము యీనాడు విధిలేక యిచ్చట వుండవలసి వచ్చింది. ఆనాడు సుశీల ఒక చక్కటి Dinner arrange చేసింది. తాను S. S. L. C. పాసయింది కాబట్టి. ఎందరెందరో వస్తున్నారు, పోతున్నారు. ఎవరైనా మాఅమ్మను అడిగినప్పుడెల్ల అత్తయ్య అమ్మను పనిమనిషి అని చెప్పాచూవచ్చింది. అది వినలేక చెవులు మూసిపెట్టుకున్నాను. ఈయింటిలో ఒక్క

క్షణముకూడ వుండకూడదనుకున్నాను. కాని యీ స్థితిలో ఎచ్చటికివెళ్ళగలను, అట్లే వుండవలసివచ్చింది. మాపరిస్థితిని తలచుకొని కృంగవలసివచ్చింది. వినరాని పలుకులను, అనరాని మాటలను అమ్మ సహిస్తూవుంది. అమ్మకు తన సొంతఅన్న యింటిలో యేమాత్రము స్వతంత్రము లేకపోవుచున్నది. కారణం మాకుమాత్రము తెలియదు. అత్తయ్య ఎందుకలా మమ్మల్ని చూచినప్పుడెల్ల అసహ్య భావముతో చూచుచున్నదో అర్థంకావటంలేదు.

అచ్చట యిన్నిదినాలు గుట్టుగా బ్రతికాము. కాని యీనాడు యీ పరిస్థితివచ్చి, అలమటించవలసి వచ్చింది. మామ రమ్మన్నాడు. అత్తయ్య యీపరిస్థితిలో మమ్ములను ఆదరిస్తుందని, గౌరవిస్తుందని అనుకున్నాము. కాని ఆమె వాళ్ళంతాకుళ్ళు. అంతా కుతంత్రపుపనులు. ఒక్కొక్కప్పుడు మామకు లేనివి, పోనివి చెప్పి పుల్లఎక్కించుచుండెడిది. అతను విని, విన్నట్టుగా పోతూవుండేవాడు. ఒకనాడు మాయిల్లు స్వర్గసీమలాగ వుండెడిది. కాని యీనాడు నరకకూపములాగ తయారయి, పడరాని బాధలుపడి, పడి తట్టుకోలేక యిచ్చటికి వచ్చాము. కాని యిచ్చటకూడ అదేమాదిరివుంది. దూరపు కొండలు నునుపు అనుకున్నాము. దగ్గరికి రాను, రాను అవి కూడ నునుపుగాలేవు. నీళ్ళనుండితీసి బయటవేసిన చేపలాగ తక, తకమని అడిపోతునాము. ఇచ్చటి వాతావరణము

పట్టుకోలేను. తమ్మునికి, చెల్లాయికి జ్వరము అప్పుడప్పుడు వస్తున్నది. ఎండలు మిక్కుటముగావుంది. సూర్యభగవానుడు యీవూరిపైన అగ్నికణములు చెరుగుచుంటాడు. మధ్యాహ్నము తారురోడ్లు సల సలకాగి సన్నకాలువలాగ ప్రవహిస్తుంది. నీగటీగలు, దోమలకు తక్కువ లేదు. కారణం మురికికాలువలు. వూరు పెద్దది అయినదేకాని, ఏమిప్రయోజనము? ఎచ్చట చూచిన అమ్మశాల్లే. యిట్లావుంది మాపరిస్థితి, వూరిపరిస్థితి. నిద్రనుండి లేచాను. పోస్టుమేన్ ఒక కవరు తెచ్చియిచ్చాడు. మరల యింకొక కవరు వచ్చింది. రెండుచోట్లకు రెండు ఇంటర్వ్యూలకు రమ్మన్నారు. ఈ ప్రయాణానికి సుశీల అమ్మదగ్గర డబ్బుతెచ్చియిచ్చింది. డబ్బుతీసుకొని బయలు దేరాను. ఇంటర్వ్యూ రోజులకు వాళ్లు చెప్పినగంటకు అచ్చటికి చేరాను. వాళ్ళు చెప్పినగంట దాటింది. కుక్కలమాదిరిగా కాచుకొని కూర్చొని యున్నాము. ఒక్కచెట్టుకూడ లేదు. వేడిగాలి మమ్ములను అట్టుడికినట్లుడికించు చున్నది. కొందరు నాపాడసన సిఫారసుతెచ్చారు. నేను ఒక్కడనే యిలా వచ్చాను ఒక సర్టిఫికేటుతో. అంతపెద్దవాళ్ళు నోరుతెరచి అడిగితే, కాదనకుండా యిచ్చేదానికి ఒకనోటును భద్రముగా జోబులో పెట్టుకొనియున్నారు. నాకన్నా తక్కువ క్వాలిఫికేషను వున్నవాళ్ళను సెలక్టు చేసుకున్నారు. దానికంతకు కారణం సిఫారసు, దానికితోడు రెడ్డిఅనేతోకపేరు చివరవుంటే ఆమాట వింటేచాలు, వానికి సహాయము చేయును అని చెప్పే

వాడులేడు. నాబోటి బికారిని ఎవరు చూస్తారు, వాళ్ళకు నేను కన్పించెదనా! ముమ్మాటికి కన్పించను. నిరాశతో అచ్చటనుండి వేరొకచోటునకు ఇంటర్వ్యూకు పోయాను. మొట్టమొదట సెలక్టు చేసుకున్నారు. మరలకొంచెము సేపటికి సెలక్టు చేసుకోలేదన్నారు. హృదయమంతా ఆవేదనతో నిండుకొన్నది. ఎట్లాయినా ఉద్యోగము సంపాదించుకొని, అమ్మను, చెల్లాయిని, తమ్ముణ్ణి మామయింటినుంచి నాదగ్గర వుంచుకోవాలని అనుకున్నాను. దానివల్లనే యింటికిపోలేదు.

ఉద్యోగముకొరకు ప్రతిఆఫీసులో అడిగాను; విఫలత్వ మును పొందుచున్నాను. ఇప్పుడు కన్నవారికి దూరముగా నున్నాను. ఇప్పటికి అన్నముతిని ఒకరోజు సునాయాసముగా గడచిపోయినది. చేతిలో చిల్లిగవ్వయైనాలేదు. ఆకలిబాధచే ప్రతి ప్రేవు అరచుచున్నది. కాళ్ళు తడబడుచున్నాయి. ఎచ్చటికి పోవాలో నాకే తెలియటంలేదు. నాకాళ్ళు ఎట్లా పోతే అట్లాపోతున్నాను. ఇప్పటికి రెండు మూడుసార్లు కార్ల క్రింద పడిపోవలసినది. ఎట్లాగో తప్పించుకున్నాను. ఎప్పుడూ రోడ్డు చాల బిజిగావుంటున్నది. కార్లు పందెములు వేసుకొని పోతే, బస్సులు వాటికి సైడ్ఇవ్వకూడదని వాటికి అడ్డుపడు చున్నాయి; కాస్త చోటుచూచుకొని రిక్షాలు చక, చకమని వెళ్ళిపోవుచున్నాయి. నేను పిచ్చిగా ఆలోచించుకుంటూ పోతున్నాను. ఇంతవిశాల ప్రపంచమును దైవము సృష్టిం చాడు. ఎన్నోకోట్లకొలది జీవరాసులకు ఆహారమును ప్రసా

ఓంచుచున్నాడు. నాకుకూడ జీవనోపాధి తప్పక చూపిస్తాడని ఆశిస్తూ నడచుచున్నాను.

ఇప్పటికే చాలరాత్రి గడచిపోయింది. ఆరోడ్డువెంబడి పోతున్నాను. "నిన్నేకదూ! పిలిచేది? రే! ఆగు! ఇంతరాత్రిలో యీ బజారులో ఎందుకు తిరుగుచున్నావు? ఆమాటలువిని అట్లాగే నిలబడిపోయాను. నన్నుదొంగని అనుమానించి వీపు మీద ఒకపెట్టు చఱచాడు. ఇంతసేపు ఆలోచించుకుంటున్న ఆలోచనలు పటాపంచలై ఎచ్చటికో వెళ్ళిపోయాయి. నా నిజస్థితిని అతనికి చెప్పుకోవాలనుకున్నాను. అతను వినే రకముగా కనబడలేదు. అతనితోకూడ నడచి వెళ్తున్నాను. ఒకవీధిచివర జేబులుతడిమాడు. మచ్చునకుకూడ చిల్లిగవ్వ యైనా అతనికి దొరకలేదు. నేను బికారినని తెలియక జేబులు చూచాడు. నిరాశ చెందాడు. స్టేషనువైపు తీసుకెళ్ళాడు. ఆరాత్రంతా నన్నుమూసిపెట్టాడు. నా నీచస్థితికిదుఃఖించాను. ఆజైలులో పిచ్చివాడులాగ అరిచాను, నా అరపును ఆలకించి పలుకరించెడి వారెవరు? నాచుట్టుకలయచూచాను. చుట్టు గాఢాంధకారము అలుముకొనివుంది. నా అరుపుల దానిలో లీనమవుచున్నాయి. నిద్రపట్టలేదు. భయముగావుంది. ఒక ప్రక్క ఆకలి. యింకొకప్రక్క భయం. ఆనేలలోనే పండుకొని దొర్లుచున్నాను. చీగటీగలు ముమ్మరముగా వున్నాయి. వాటి యిష్టప్రకారము కసిదీర కుట్టుచున్నాయి. అలసి సొలసి పోయాను. కాస్త నిద్రపట్టింది. ఏదో చెడ్డకలగన్నాను.

ఆకలను నేను వర్ణించలేను, చెప్పలేను. దాని ప్రభావమును ఎట్లావుంటుందో నాకు తెలియదు. ఇప్పటికి రెండుగంటలు దాటింది. కొద్దిసేపు దేవుని స్తుతించాను. కొద్దిసేపు నాయిష్ట ప్రకారము తిట్టాను. ఇట్లాగడచిపోయినది ఆరాత్రి.

తెల్లవారినది. సుప్రభాతము గుడిలో చదువుచున్నారు. గణ గణమని గంటలు మ్రోగుచున్నాయి, మంగళవాయిద్యములు వినబడుచున్నవి. సూర్యభగవానుడు అప్పుడే లోకమును సందర్శించుటకు యాత్రీకునివలె బయలుదేరాడు. తలుపులు తెరచారు. గబ గబమని కేపదగ్గరికెళ్ళాను! ముఖమును క్షాళన చేసుకొని, కాస్త నీళ్ళుత్రాగి స్టేషనునుండి బయట పడ్డాను. ఆకలివేస్తున్నది. కండ్లు నిప్పులు గ్రక్కుచున్నాయి. ఆవులింపులు మితిమీరి వస్తున్నాయి. మరల ముఖమును కడుక్కొని, మరల నీళ్ళుత్రాగాను. ఆనీళ్లు నా ఆకలికి జవాబు చెప్పలేకపోయినది. విధిలేక అట్లాగే నడచివెళ్తున్నాను. ఒక్క సారి ఆ కల జ్ఞాపకమువచ్చింది. వొళ్ళంతా ఒక్క సారి కంపించినది. గబ గబ స్టేషనువైపు పరుగెత్తాను. ఇప్పటికి యిల్లువిడచి పదిరోజులు దాటింది. వుద్యోగము మాత్రము శూన్యం. తమ్ముని, చెల్లాయిని, అమ్మను చూడాలని యింకా స్పీడుతో పరుగెత్తుచున్నాను. నన్ను పిచ్చివానిక్రింద జమకట్టి చూస్తున్నారు. ఇక రైలుకదలుటకు సిద్ధముగావుంది. గబ గబమని ఒక కంపార్టుమెంటులో ఎక్కికూర్చున్నాను. రైలు ఒక్కవూపు వూపి బయలుదేరింది, రాత్రంతా నిద్రలేమిచే

చల్లటిగాలికి బాగా నిద్రపట్టినది. ఎన్నెన్నో చిన్నచిన్న స్టేషనులు దాటిపోయినాయి. నాకుమాత్రము మెలకువరాలేదు. ఒకస్టేషనువద్ద నన్ను ఎవరో తట్టిలేపారు. నీరసముగా వుండుటచే మరల పడుకున్నాను. గట్టిగా తట్టాడు. ఇప్పుడు బాహ్య ప్రపంచములోనికి వచ్చాను. ముందర చూచేసరికి గుండెదడ ఎక్కువైంది. చొక్కాయిని తడిపివేసాయి స్వేద బిందువులు. ముఖము పాలిపోయి, నీరసముగావుంది, యిప్పుడు మరీపాలిపోయింది. భయముతో లేచినిలబడ్డాను. అతనిని యింతసేపు ఎవరోఅనుకున్నాను.. అతను నా స్నేహితుడు కాబట్టి మరల ధైర్యము తెచ్చుకున్నాను. అతను నన్ను గుర్తు పట్టలేదు. కారణం నావేషం, నేనే నానిజస్థితిని చెప్పుకున్నాను. ఆశ్చర్యపడ్డాడు, చింతిల్లాడు. అంతకన్నా అతను ఏంచేస్తాడు. రైలు ఒక్కకూతకూసి స్టేషనులో ఆగింది. బండిదిగి యింటి వైపు గబ గబమని నడకసాగించాను. కాళ్ళు తడబడు చున్నాయి. ఈపదిరోజులకే ప్రదేశమంతా క్రొత్తగా కనబడు చున్నది. ఆదుర్దాగా యింటిలోనికి ప్రవేశించాను. ఇల్లంతా నిశ్శబ్దముగావుంది. చెల్లాయి, తమ్ముడూ కనబడలేదు. అమ్మ కూడ కనబడలేదు. ఇల్లంతా వెతికాను. అత్తయ్యమాత్రము వంటయింటిలో సతమతమవుచున్నది. తోటలోనికి బయలు దేరాను.

ఒక్కమూలకూర్చొని దుఃఖిస్తూవుంది సుశీలా? సుశీలా! అమ్మా, చెల్లాయి, తమ్ముడు ఎచ్చటికి పోయారు. లేచినిలబడి

అట్లాగే దుఃఖిస్తూవుంది. మాట్లాడలేదు. అడిగినదానికి జవాబు చెప్పలేదు. ఇంకా ఎక్కువగా దుఃఖిస్తూవుంది. చెప్పుసుశీలా! అమ్మ ఎట్లాపోయింది. దుఃఖిస్తూ అమ్మ! అని నిలిపివేసింది. సుశీలా ఎందుకు భయపడుచున్నావు. అమ్మ యిచ్చట లేదా? మావూరికి వెళ్ళిందా? ఏమైనదో చెప్పుసుశీలా? అత్తయ్య చనిపోయింది. ఆ! అమ్మచనిపోయినదా! అమ్మచనిపోయినదా! తమ్ముడు, చెల్లాయి ఎచ్చటికో వెళ్ళిపోయారు? సుశీలా! నీవు నిజము చెప్తావని ఆశించుచున్నాను. అమ్మకు ఏదైనా జ్వరము వచ్చినదా! లేక దేనికి చనిపోయినది? తమ్ముడు, చెల్లాయి ఎందుకు వెళ్ళిపోయారు? నిజం దాచకుండా చెప్పుసుశీలా! అత్తయ్యకు జబ్బురాలేదు. మాఅమ్మవలన. మాయింటిలో నగపోయింది. అత్తయ్యమీద ఆనిందమోపినది! ఆ అవమానమును, తిట్లు సహించలేక అత్తయ్య చనిపోయినది. అత్తయ్య చనిపోయినతర్వాత తమ్ముణ్ణి, చెల్లాయిని తరుమగొట్టింది. అమ్మమాటలు నిజమని అనుకున్నారు. అంతా అబద్దమని కడపట తేలిపోయాయి. ఆనిందకు అత్తయ్యమాత్రము బాధ్యురాలుకాదు. ఆ నగ ఎచ్చటా ధారపోలేదు, అమ్మ ఒకచోట పెట్టి మరచిపోయి అత్తయ్యమీద దొంగతనము మోపింది, అంతే! శేఖర్ మామయ్య! ఆనాడు నేను సినిమాకుపోయి వచ్చినప్పటికే అత్తయ్య బావిలోపడి చనిపోయినది. ఈలెటర్ వ్రాసిపెట్టివుంది.

"శేఖర్ బాబు! నిన్ను, బిడ్డలను శాశ్వతముగా విడనాడి

పోతున్నాను. నిన్ను చూడకుండా! పసికందులను విడువలేక విడిచి వెళ్తున్నాను. పరిస్థితులు అట్లా ప్రేరేపించాయి, విధి ఆలా వ్రాసిపెట్టాడు. నా చావుకు ఎవరూ బాధ్యులుకాదు. వాళ్ళను ఏమి అనవద్దు. నాఅన్న చాలమంచివాడు. సుశీల చాలా మంచిది. బాబూ! నిన్ను కడపటిసారి చూడలేదని ప్రతి రక్తపుబిందువు ప్రేమతో కలవరించింది; నామనస్సు నీకొరకు తహ, తహలాడినది. చెల్లాయిని, తమ్ముణ్ణి పెంచు. సుఖముగా కాలముగడపండి. నావుత్తరమునుచూచి దిగులు పడకు. నాకొరకు పరితపింపవద్దు. ఎప్పటికైనా పోవలసిన దాననే. కాని యిప్పుడే వెళ్ళిపోవుచున్నాను. బాబు నీవు నన్ను చూడలేకపోతే వుండలేవు. గుండె ధైర్యముచేసుకో. బిడ్డలను విడువవద్దు. ఇదే నాకడపటి ఆశయము.

ఇట్లు

మీతల్లి

అమ్మా! మమ్ములను వదలిపెట్టి వెళ్ళిపోయావా! నా చేతులార నిన్ను చంపుకున్నాను. నా తల్లిచావుకు నే నే బాధ్యుడ్ని, కన్నతల్లిని కడపటిసారికూడ నోచుకోలేని అభాగ్యుడ్ని, నాతల్లిహృదయం ఎట్లు తల్లడిల్లినదో! అటువంటి తల్లిని యికకలుసుకుంటావా! నీకు పిచ్చేమిటి? అటువంటి తల్లిని కలుసుకోలేను. కడపటిసారి తమ్ముణ్ణి, చెల్లాయినికూడ చూచుటకు నోచుకోలేని అదృష్టహీనుణ్ని, ఎచ్చటికివెళ్ళారో, ఎచటికిపోయారో! ఆహారములేక, నడువలేక, బాధతో, కృంగి

కృషించి శల్యమై యిక కనబడతారో లేదో! దీనికంతకు కారణ భూతురాలు అత్తయ్య. ఆపాపాత్మురాలి ముఖమును చూడ కూడదనుకున్నాను. చూస్తే మహాపాపం. అచ్చట ఒక్క క్షణముకూడ వుండకూడ దనుకున్నాను. ఎవరున్నారని యిచ్చట వుండాలి, వెంటనే బయటికి వచ్చేశాను, ఎచ్చటి నుండో మామయ్య వచ్చాడు, అతనికి కడపటి ఒకనమస్కా రముచేసి, బయలుదేరాను.

తమ్ముడు, చెల్లాయి కొరకు పిచ్చివాడులాగ ప్రతివీధి గాలించాను. అమ్మమాట నిలబెట్టాలి. వాళ్ళను చూడాలి. వెతకుచున్నాను. నిరాశచెందుచున్నాను. వాళ్ళు ఎచ్చట కనబడలేదు. ఎప్పటికైనా వాళ్ళను కలుసుకుంటానని ఆలో చిస్తూ నడచివెళ్తున్నాను. నిజమేకదు! నేను ఎవరికొరకు బ్రత కాలి? నాన్న చనిపోయాడు, అమ్మపోయింది. సోదరులు కన్ను మరుగయ్యారు. నేను మిగిలాను. నా జీవితముపై విరక్తి కలిగినది. చచ్చుటకు బయలుదేరాను, ఒక చెరువుదగ్గరకు. ఆ నిశీధసమయములో నేను, నాచుట్టు చెట్లుతప్ప యింకేమి లేవు. నిర్మలముగావున్న నీళ్ళను మత్స్యములు గందరగోళము చేస్తున్నాయి. చెఱువులోనికి రెండు అడుగులువేసాను. నీవుచచ్చి సాధించేదేమిటి? నీవాళ్ళు నీకు కనబడకుండా పోతారా పిచ్చివాడా! నీకన్నా ఎక్కువ కష్టాలు అనుభవించిన వాళ్ళు, పడరానిపాట్లు పడినవాళ్ళు నీమాదిరి చచ్చుటకు ప్రయత్నించలేదు. పో! వెనుదిరిగిపో! ఇప్పటివరకు చీకటి

బాటలో నడిచావు. ఇప్పుడుకూడ నడచుచున్నావు. లేవో నూనో వెలుగుబాటలోనికి అడుగుపెట్టవచ్చు. నామాటవిని వెనుదిరిగిపో! నీ తమ్మునిపైన, చెల్లాయిపైన నిజమైన ప్రేమ కలిగిన వాడివైతే, మీఅమ్మమాట నిలబెట్టుటకు పూనుకొనిన వాడివైతే, వెంటనే వెనుదిరిగిపో? అని నామనస్సు ఆదేశించింది. వెంటనే వెనుదిరిగాను.

మామ యింటినుంచి వెడలినతర్వాత అమ్మపోయిందని అన్నను చూడలేదని ఆవేదనతో ఆ పసిహృదయాలు కంపించి పోయాయి. దుఃఖిస్తూ, దుఃఖిస్తూ నడుస్తున్నారు. ఎవరు పట్టెడు అన్నము పెట్తారు? వుండుటకు చోటెవరిస్తారు? బిడ్డల ఆకలి బాధ తల్లికి తెలుసు. ఆకలితో అలమటిస్తూ బయలు దేరి పోతున్నారు. ఎచ్చటికిపోవాలో వారికి గమ్యస్థానము ఎక్కడ వుందో వారికి తెలియదు. గ్రుడ్డిగా నడుస్తున్నారు. అలసి సొలసి ఒకబంగళాదగ్గర పడిపోయారు. అట్లాగే చల్లగా కన్నులు మూసారు. ఆ బంగళా ఒక ధనవంతునిది. నిద్రలేచే సరికి ఆ బంగళాలోపల వున్నారు. వాళ్ళకే ఆశ్చర్యమైనది. చుట్టుకలయచూస్తున్నారు. ఒక స్వర్గసీమలాగ ఆయిల్లు వాళ్ళ కండ్లకు కన్పడుచున్నది. ఆ నునుపైన గోడలు, దానికి వేసిన రంగులు, తలుపులను చెక్కిన శిల్పములు, రక, రకాలపోటోలు వివిధములైన కుర్చీలు, టేబుల్సు విద్యుద్దీపముల అలంకరణ, ఆ బిల్డింగుచుట్టు Compound దానిలోపల ఒక పెద్దతోట, దానిలోని రక, రకాల పుష్పాలు, Foun. .n system

వాళ్ళను ఆశ్చర్యపరుస్తున్నది. ఆబంగళా ఒక ధనవంతుడైన దయార్ద్రహృదయుడైన చంద్రశేఖర్ నాయుడు గారిది. అతనికి ఒక్క పెద్దకొడుకు, చిన్నపాపవుంది. ఆపాప పుట్టినతర్వాత వాళ్ళఅమ్మ చనిపోయినది. ఆ తల్లిలేని బిడ్డను, తనే తండ్రి, తల్లియై అల్లారుముద్దుగా పెంచుచున్నాడు. ఆపాప "అమ్మా" అనుచు ఎప్పుడు ఏడుస్తూ వాళ్ళను చాలా కష్టపెట్టుచున్నది. వీళ్ళతోకూడవుంటే, వీళ్ళతో ఆడుకుంటూ, పాడుకుంటూ వుంటుందని యీ యిద్దరిని చేరదీసాడు. అతనికి సంవత్సరా మునకు ఐదువందలపుట్ల ధాన్యమువస్తుంది. ఆవూరిలోనే ఒక పేపరుమిల్లు, ఒక బట్టలమిల్లు, ఒక రైస్‌మిల్లుపెట్టి నడపించు చున్నాడు. ఎందరెందరో సేవకులు, పనిమనుష్యులున్నారు. ఇది వాళ్ళస్థితి:

ఆపాప వీళ్ళతో ఆడుకుంటూ కాలము వెళ్ళబుచ్చుచున్నది. వీళ్ళనుకూడ తన సొంతబిడ్డలాగా చూస్తున్నాడు. చదువు సంధ్యలు చెప్పిస్తున్నాడు. ఆ పసిహృదయాలు అన్నకొరకు పరితపిస్తున్నాయి. విధిలేక అచ్చటనే చదువుకుంటూ పెరుగు చున్నారు.

 

వాళ్ళజాడ నాకు యిప్పటివరకు కన్పడలేదు. అమ్మ మాటలు ఒక్కసారి జ్ఞాపకమువస్తాయి. నేను మాత్రము యేం చేసేది? నేను యిచ్చట వుద్యోగములేక అలమటిస్తున్నాను. ఒకనాడు Employment Exchange ద్వార వుద్యోగము

వచ్చింది. లేక, లేక రాక, రాక వచ్చింది. ఇప్పుడు చెల్లాయి, తమ్ముడువుంటే ఎంతో సంతోషముగా వుండేది. నాకిప్పుడు రెండు మూడు రోజులుగా జ్వరము వస్తున్నది. హాస్పిటల్‌కు పోయి మందు తీసుకొని బయలుదేరాను. నేను ఎక్కిన కంపార్టుమెంటులో ఎక్కువ జనములేదు. ఎవరో ఒక అమ్మాయి ఇద్దరు, ముగ్గురు కుర్రవాళ్లు, నలుగురైదుగురు యాత్రీకులు వున్నారు. వికలమనస్సుతో ప్రయాణము చేయుచున్నాను. ఈనాడు, ఒకనాడు చదువుకొనిన స్కూలులోనే పనిచేయమని వచ్చింది. కాని ఒళ్ళు బాగాలేదు. రైలు పరుగులుతీస్తుంది. చలిగాలికి జ్వరము యింకాకొంచెము ఎక్కువైంది. ఆ చీకటిలో చెట్లువిరబోసుకొనిన దెయ్యాలలాగ కనబడుచున్నాయి. కీచురాళ్ళ ధ్వని తీవ్రముగా వినబడుచున్నది. జ్వరము ఎక్కువైంది. నా స్మరణ నేను తప్పిపోతున్నాను. చలిగావుంది. ఆకలిగా వుంది, నోరు ఎండిపోవుచున్నది. రైలు రెండు మూడు స్టేషనులుదాటింది. అట్లాగే మైకముగా వున్నాను. రైలు ఇంకొక స్టేషనువద్ద ఆగింది. ఒక అబ్బాయిని కాఫీ తెచ్చిపెట్టమని అడిగాను. నిరాకరించాడు. నేనే త్రాగుటకు బయలుదేరాను, బయలుదేరుటకు మునుపే తాను తెచ్చిపెట్టానని ఆ అమ్మాయి అన్నది. నేనేవద్దన్నాను. బండిదిగాను, ఆధారము గైకొని. కాళ్ళు తడబడుచున్నాయి. రెండు, మూడడుగులు వేసాను. అట్లాగే చతికిలబడ్డాను. అంతేనాకు తెలిసింది. మరల నా స్వాధీనములోనికి వచ్చాను. ఆమె నాకు కాఫీ

త్రాగిపించి, కంపార్టుమెంటులోనికి చేర్పించినది. నామనస్సులో ఆమెను ధన్యవాదాలు అర్పించాను

జ్వరము కాస్తకూడ తగ్గలేదు. తన ఫ్లాస్కులో కాఫీ పోసుకొనిన కాఫీని అప్పుడప్పుడు నాకు యిచ్చుచున్నది. నా తలకు మఫ్లర్ చుట్టినది, చలిగాలి తగలకుండా వుండేదానికి. ఆమె ఎవరు? నేనెవరు? ఆమెను ఏతల్లి కన్నదో! నాకు సేవ చేయమని విధివ్రాసిపెట్టాడా! లేక, తోడి మానవుడు కష్టములో వుంటే సహాయముచేయవలసిన ధర్మము తనదని నాకు సేవచేస్తు న్నది. ఆమెగాని నాకు సేవచేయకపోతే నేనుఏమయ్యేవాడిని? సొంతచెల్లికన్న ఎక్కువగా సేవచేస్తున్నది. ఒక్కసారి మనసారా చెల్లాయ్ అనిపిలవమంది నాహృదయం. చెల్లాయ్! నాబొందెలో ప్రాణం వున్నంతవరకు నీమేలు మరువనుచెల్లాయ్. బండిప్లాట్ ఫారంవద్ద ఆగింది. నేను నడచేస్థితిలోలేను. నాకు ఎవరున్నారు నా బాగోగులను చూచుటకు చెల్లాయ్! నీవు ఎచ్చటికి పోతున్నావు? నేనుకూడ యిచ్చటకే వచ్చాను. ఈవూరిలో నే నన్ను **Clerk** గా **appoint** చేసారు. చెల్లాయ్! ఇచ్చట నీకు బంధువు లెవరైనా వున్నారా? లేదన్నయ్యా. ఇచ్చట ఎవరు నాకులేరు కాబట్టి, యీవూరికి ముందేవచ్చి రూము చూచుకోవాలి కాబట్టి వచ్చాను. నామాట ఒక్కటివింటావా చెల్లి! నాకుయింతసేపు సేవచేసావు. నీసేవకు నేను ఋణ పడ్డాను. కాని చెల్లి! నేను యీస్థితిలో వున్నాను. నాకుకూడ ఎవరూలేరు భగవంతుడుతప్ప. కాని అతనికికూడ నామీద

చాల కసిగావుంది. నేనుకూడ వుద్యోగము చేయుటకు వచ్చాను. కాని యిప్పుడుకూడ దౌర్భాగ్యము వెంబడిస్తూనే వుంది. చూడు చెల్లాయ్! నేను ఒక రూము తీసుకొంటాను. నాకు జ్వరముకాస్త నయమయ్యేవరకు నావద్దవుండు చెల్లాయ్. ఆ సహాయము చేసిపెట్టు. నీకు యిష్టమైతేవుండు. కష్టముగా, వీలు లేకపోతే వద్దమ్మా! అన్నయ్యా! అట్లాగేవుంటాను. ఎందుకు అలా వణికిపోవుచున్నావు. ధైర్యముగావుండు.

నేను, మా చెల్లాయ్ నానా అవస్థలుపడి ఒకరూము పదిరూపాయలకు తీసుకున్నాము. మనుష్యులెవరూ దానిలో వుండినట్లుగాలేదు. దుమ్ము ఎక్కువగావుంది. నేను రిక్షాలో ఆసుపత్రికి పోయివచ్చేసరికి మా చెల్లాయ్ అంతా శుభ్రము చేసి నాకు పడక వేసినది. ఆపడకఅంటే చాప, దిండు ఆయింటి ఆమె యిచ్చినట్లుగావుంది. ఆ రాత్రంతా హీనముగావుంది, జ్వరం, డాక్టరు టైఫాయిడ్ అన్నాడు. గుండె ఝల్లుమన్నది. నేను అప్పుతెచ్చిన ముప్పైరూపాయలను ఐదురూపాయలు మాత్రమేవుంది. రాత్రిపూట కలువరింతలు ఎక్కువైనాయి. నా అడ్రసు చెప్పుచున్నది నా చెల్లాయ్. నాకు తల్లి, తండ్రులు ఎవరూ లేరని చెప్పి ఆమెకు తృప్తిపరిచాను. పనిలో చేరవలసిన రోజు రిక్షాలోపోయాను, నా పాత హెడ్ మాస్టర్ కాబట్టి పనిలోవచ్చి చేరినట్లుగా సంతకము పెట్టుకొని యింటికి పొమ్మన్నాడు నాపరిస్థితిని చూచి. నా చెల్లాయ్కూడ పనిలో చేరినది.

ఇప్పటికే మామీద రక, రకాల పుకార్లు బయలు దేరాయి. ఒక పుల్లమ్మ అదివాడ్ని లేపుకొని వచ్చేసినదంటే, యింకొక ఎఱ్ఱమ్మ కాదు, కాదె వాడేతీసుకొని వచ్చాడంటూ! ఇంకొక నల్లమ్మ ఆ వాదనలకు సమర్థిస్తూవుంది. వీనినంతా నేను రిక్షాలోపోతూ విన్నాను. ఇంటికిమందు తీసుకొనివచ్చేసాను. మా చెల్లాయ్ యీ మాటలు విననట్లుగావుంది. రెండురోజుల నుండి ఒకమాదిరిగావుంది. నాకు జ్వరము తగ్గిపోయినది. లోకం గ్రుడ్డిది. దానికి విచక్షణాజ్ఞానములేదు. నేను చెల్లాయిగా భావించుచున్నాను. ఆమెనన్ను అన్నగా ప్రేమిస్తూవుంది. మాది నిర్మలమైనప్రేమ. ఎవరు ఎట్లాఅనుకుంటేమాత్రము మాకు భయములేదు. ఎందుకు భయపడాలి? కాని చెల్లెమాత్రము దాని అఱుపులకు భయపడినది. "అన్నయ్యా! నీకు జ్వరము నయమైనదిగదూ! నేను వేఱే రూము తీసుకొనివుంటాను" అని దుఃఖించినది. ఆమె హృదయము చెప్పరాని ఆవేదనతో నిండుకొంది. నాదగ్గర సెలవుతీసుకొని వేరొకచోటునకు వెళ్ళి పోయినది. ఆవీధిలోయుండుటకు నా మనస్సు అంగీకరించుట లేదు. నేనుకూడ వేరే వీధిలోచేరాను. అప్పుడప్పుడు చెల్లాయిని కలుసుకుంటున్నాను. నేనువుండేది ఒకయింటి లోపలిభాగములో నుండు ఒకచిన్నరూములో, పైనకూడ రూములున్నాయి. అవి భర్తీగా కాలేజీస్టూడెంట్సు వున్నారు. ఆ యింటిలో ఒక అమ్మాయి, వాళ్ళ అమ్మమాత్రమువుంది. వాళ్ళ ప్రవర్తన కొద్దిగా చెడ్డగావుంది. విధిలేక అచ్చటనే

వుండవలసివచ్చినది. ఆ అమ్మాయి చాలచనువుగా ప్రవర్తించేది. నాచెల్లాయి, తమ్ముడూ ధారపోయి యిప్పటికి ఒకసంవత్సరపు రోజులు దాటిపోయి రెండు. మూడునెలలుకూడ దాటింది. వాళ్ళను తప్పక కలుసుకుంటానని దినమును కలలుగనుచున్నాను. ఎప్పుడు నిజము అవుతుందో నాకు తెలియదు.

ఎండలు మిక్కుటముగా కాయుచున్నవి. వుక్క కు తట్టుకోలేక తలుపులు, కిటికీలు అన్ని తెరచిపండుకొని నిద్ర రాకపోవుటచే యిటు, అటు దొర్లుచున్నాను. మొట్టమొదట ఎవరో నాగదిలో ప్రవేశించారు. మొట్టమొదట దొంగ అనుకున్నాను. తెరచివున్న తలుపులు వేశారు. దొంగకాదు. ఆమె ఆయింటి అమ్మాయి; ఏమిటమ్మా యిట్లావచ్చావు? పో, వెళ్ళిపో,! ఎవరైనాచూస్తే ఏమైనాఅనుకుంటారు? వెళ్ళి పోచెల్లాయ్. చెల్లాయ్ చెల్లాయ్ "అనకు లతాంగి అనిపిలువు" ఇంకా ఎక్కువగా మాట్లాడకుండా ముందు బయటికి వెళ్ళిపో? నట్టుగా! ఆ లతాంగి నీదగ్గరకువచ్చింది. ఆ లతలో ఎన్నెన్నో పూలు వికసించివున్నాయి. ఆ వాసనను ఆఘ్రాణించు, ఆనందపడు. ఏమిటిచెల్లి. యీ నీ వింతమాటలు, యీ పాడుబుద్ధి? నా కోరిక నెరవేర్చు నా! లేకనిన్ను అవమానపాలు చేయమంటావా! ఆడదానిపగ నాగుపాములాంటిది. ఆడది ప్రపంచములో ఏమైనా చేస్తుంది. గందరగోళము చేయక రా! శేఖర్. "ఆలస్యము అమృతం విషముఅన్నారు. నాచెయిపట్టు పో! చెల్లీ. పో? నీపాదాలంటుకుంటాను. ఇచ్చటనుండి

వెళ్ళిపో! చెల్లీ! నా జీవితమే ఒడుదుడుకుల్లోవుంది. విసిగి, వేసారిపోయివుంది. నాజీవితనౌక ఎన్నెన్నో సుడిగుండాలతో ప్రయాణముచేసి, వాటినన్నిటిని తప్పించుకొని నిర్మలమైన నీటిలో ప్రశాంతముగా ప్రయాణముచేయుచున్నది. దానిని అటాగే సాగనివ్వు. చెల్లీ! ఈ వయస్సులోనే కన్నతల్లిని, తండ్రిని పోగొట్టుకున్నాను. తుదకు చెల్లాయిని, తమ్ముణ్ణికూడ దారబోసుకొని యీనాటికి వారిని చూడలేక పరితపిస్తున్నాను. నా జీవితానికి ఒక కళంకము తెచ్చిపెట్టకు. నేనిప్పుడు నిస్సాహాయుడ్ని. నీవు ఏమిచేసినాసరే! నీవు పాలలోముంచినా, నీళ్ళలోముంచినాసరే! నీ జీవితాన్ని నీ శీలత్వమును పాడు చేసుకోకు. భారతదేశము పాతివ్రత్యమునకు పుట్టినిల్లు. పావనముగా, సుఖముగా బ్రతుకు. చూడు చెల్లి కొడవలి, గొడ్డలివుంది. మన మెడలను కోసుకొనుటకు కాదు. మన తలలను కొట్టుకొనుటకుకాదు. వాటిని వుపయోగించేరీతిలో వుపయోగిస్తే అవిమనకు మేలుచేస్తాయ్. నీ యౌవ్వనాన్ని సద్వినియోగపరచుకో! పాడుచేసుకోకు. సంఘములో పతిత అని అనిపించుకోకు. మీ వంశానికి కళంకము తెచ్చిపెట్టకు. నా బ్రతుకును వీధిలోపాలుచేయకు. నేను ఒకమనిషినని, నాకు సంఘములో గౌరవమర్యాదలు కావాలని అనుకున్నాను. నన్ను రచ్చకెక్కించకు. చెల్లీ నామాటవిని వెళ్ళిపో! నా జీవితాన్ని అగుడుచేసింది. నాజీవితాన్ని మంటలోగలిపింది. తృప్తిచెందింది.

ఈ వూరిలో ఒకక్షణము వుండకూడదనుకున్నాను. వుద్యో గానికి రాజీనామాగేసి, నా చెల్లాయితో చెప్పి ఆవూరిని విడచి పెట్టాను. నాకొరకు చింతించినది. నా జీవితముపై పూర్తిగా విసుగు జనించినది. పిచ్చివాడులాగ వెళ్ళుచున్నాను. ఇప్పటికి చెల్లాయి, తమ్ముడు దూరబోయి రెండు సంవత్సరములు దాటింది. వాళ్ళను చూడనిది యిక జీవించకూడదని అనుకున్నాను. వాళ్ళను చూస్తానో, లేదో అనే శంక నాలో బయలుదేరింది. ఇప్పటికి అన్నముతిని నాలుగురోజులైనది. కాఫీనీళ్ళతో, రెండు, మూడు అరటిపండ్లతో దినములను గడుపుచున్నాను. ఇప్పుడు రెండు, మూడు పల్లెలు కాలినడకతోనే దాటాను. అట్లాగే పోతున్నాను. ఆ వూరిలోని స్కూలు వదలిపెట్టారు. పిల్లలు సంతోషముగా, గంతులు వేసుకుంటు యింటివైపుకు పరుగులు తీస్తున్నారు. హోరున గాలి వీస్తున్నది. వానకూడ పడుచున్నది. రోడ్లదగ్గరనున్న చెట్లదగ్గరకు పరుగెత్తుకొనిపోయి నిలబడుచున్నారు. నేనుకూడ ఒక పెద్దచెట్టుదగ్గర నిలబడ్డాను. ఆ చెట్టుకు యింకొకవైపులో నా చెల్లాయి, తమ్ముడూ నావిషయమే అచ్చటకూడ మాట్లాడుచున్నారు. నాకండ్లను నేను నమ్మలేక పోయాను.

ఒక్కసారి గట్టిగా యిద్దరిని ఆలింగనము చేసుకున్నాను. తనివితీర ముద్దుపెట్టుకున్నాను. ఇప్పుడు ఎంతో పెద్దవారైనారు. వేషభాషలలోకూడ చాల మార్పువచ్చింది. అమ్మ చనిపోయినదని, నాకు తెలియదేమోనని దుఃఖిస్తూ నాతో

చెప్పారు. నాకు తెలియదేమోనని. నన్ను ఆ జమీాందారుని యింటికి రమ్మన్నారు. వాళ్ళు నా పరిస్థితిని చూసారంటే, మా చెల్లాయికి, తమ్మునికివున్న ఆదరము పోతుందని అచ్చటికి పోవుటకు నిరాకరించాను. తమ్ముడు, చెల్లాయి యిప్పుడు ఐదవఫారము చదువుచున్నారు. ప్రతిదినము వాళ్ళు స్కూలుకు పోవునపుడెల్ల కలుసుకుంటున్నాను, ఆనందించుచున్నాను. ఆ జమీాందారుని మంచి చెడ్డలు మా చెల్లాయిని, తమ్ముణ్ణి అడిగి తెలుసుకున్నాను.

ఒకే వుదయము నౌకరుకొరకు అచ్చటికి వెళ్ళాను. అతను నన్ను అతని మిల్లులో **Clerk** గా **appoint** చేసాడు. వాళ్ళతో ఎప్పుడునూ నా చెల్లాయిని, తమ్ముణ్ణి, ఏకోదరులని ఎన్నడూ చెప్పలేదు. ప్రతిదినము చెల్లాయితో, తమ్మునితో ఆడుకుంటూ, పాడుకుంటూ కాలము గడుపుతున్నాను. ఇట్లా ఆరునెలలు గడచిపోయాయి; మా సంగతి ఎట్లాగో తెలిసిపోయినది వారికి. ఆనాడు ఆ యింటిపాపకు **Birthday Cermony** చాల బాగుగా జరిపించాడు. ఎందరెందరో వచ్చారు. అందరు వెళ్ళిపోయారు. ఫ్యాక్టరీనుండి వెయ్యిరూపాయలు తెచ్చాడు. తెచ్చినప్పుడు నేను అతనితో మాట్లాడుచున్నాను మిల్లువిషయము. అతను ఆ డబ్బును డ్రాయరులో పెట్టి ఏదో అర్జంటుపనిమీాద వెళ్ళిపోయాడని, నాకు తెలియదు. ఆయన తెచ్చినప్పుడు చూచినానుగాని, అతను ఎచ్చట పెట్టినది గమనించలేదు. అతను వెళ్ళిపోగానే

నేనుకూడ వెళ్ళిపోయాను. అతను పెట్టినచోట డబ్బులేక పోవుటచే ఆ దొంగతనము నేను చేసానని ఆ నింద నాపై మోపారు. నిజమును చెప్పాను. జరిగినదంతా పూసగ్రుచ్చి నట్లుగా చెప్పాను. నాపలుకులు ఎవరికి వినబడలేదు. నానా మాటలన్నారు. తుదకు పనికిమాలిన సేవకులుకూడ నానా మాటలన్నారు. అన్న దొంగతనము చేసాడని వినగానే ఎచ్చటికో వెళ్ళిపోయాడు. ఇన్నిదినాలు పెంచి గారాభముగా చూచిన ఆధనవంతునికి తన మనస్సులో నమస్కారముచేసి, కృతజ్ఞతభావముతో యిల్లునువిడచి ఎచ్చటికో వెడలిపోయాడు: సొత్తువుండేది ఒకచోట, అనుమానము యింకొకచోట. ఇది లోకవు సహజగుణం. నాకిప్పుడు దేవుడే శరణ్యం. నన్ను కాళ్లుచేతులు కట్టివేసారు. నానా దెబ్బలుకొట్టారు; నిజమును చెప్పమని బెదరించుచున్నారు. మీరే చెప్పండి. నేను వారికి ద్రోహము చేయుటకు నా హృదయం ఒప్పుకుంటుందా ? ఒక పనికిమాలినవాడికి, ముక్కు మొగము యెరుగనివానికి, అందులో బికారిలాగ తిరుగుచున్న నాకు నిలుచుటకు, వుండుటకు ఆశ్రయ మిచ్చి, వుద్యోగమిచ్చి, నన్ను తన యింటిలో అందరిలాగ ఆదరించుచున్నవారికి నేను యీ చేతులతో ద్రోహము చేస్తానా! నా చెల్లాయిని, తమ్ముణ్ణి మరలా కంటికి మరుగు చేసుకుంటానా! నేను నిజమును, నిజముగా చెప్పాను. కాని నన్నెవరూ నమ్మలేదు. నన్ను కొట్టుచున్న దెబ్బలను అతని మనస్సు నిజము చెప్పమని బాధించినది. ఒక అమాయకునిమీద

వున్న అపోహను, నామీాదనున్న నిందను పోగొట్టాను. తను చేసినతప్పుకు క్షమాపణకోరాడు. ఇప్పుడు ఆ డబ్బును కాజేసినది ఎవరోకాదు ఆ యింటిలో సుమారు ముప్పై, నలభై సంవత్సరములనుండి పనిచేయుచున్న సేవకుడు. అతను యింతకు మునుపు (యిన్నిదినాలు) చిల్లిగవ్వయైనా దొంగతనము చేయలేదు. కాని యీనాడు దొంగతనమునకు పూనుకొని, దొంగతనము చేసాడు, కారణం తన యింటిపరిస్థితులు, సంఘపు పరిస్థితులు అలా ప్రేరేపించాయి. అతనికి లేక, లేక ఒకఆడబిడ్డ పుట్టింది. ముద్దుగా పెంచాడు. ఇప్పుడు యుక్తవయస్సును వచ్చింది. ఈనాడు వివాహము చేయాలి. ఇప్పటికే ఎన్నెన్నో సంబంధాలు వచ్చాయి. కాని అవి వచ్చినదారినే వెళ్ళిపోయాయి, కారణం వరకట్నం యిచ్చుకోలేకపోవుటచే, ఎవరు ఆమెను పెండ్లి చేసుకొనుటకు ముందుకురాలేదు. ఎన్నిదినాలు యింట్లోవుంచుకొని, సంఘపు ఎక్కిరింపులను హేళనలను వింటాడు. ఎట్లాగో డబ్బును సంపాదించి తన కూతురికి పెండ్లి చేయవలయునని అతని మనస్సులో అనుకున్నాడు. ఇన్నిదినాలు మన సంఘములో వీరవిహారము చేయుచున్న ఆ వరకట్న పిశాచాన్ని యెదిరించలేకపోయాడు. ఈనాడు యీ వెయ్యి రూపాయలతో, దానిని జయించాడు; సంతోషముగా తనకూతురికి వివాహముచేయుటకు పూనుకున్నాడు. తన స్థితినంతా చెప్పి యజమానికాళ్ళపై బడ్డాడు; తను తీసుకొనిన రూపాయలను తన యజమానిముందు వుంచాడు (పెట్టాడు). అతని పై

కనికరించి, అతనిని ఆ డబ్బును తీసుకొని వెళ్ళిపొమ్మన్నాడు. నన్ను క్షమార్పణ కోరాడు. జరిగినదంతా మరచి పొమ్మన్నాడు. తమ్ముడు, చెల్లాయిని వెదకించుటకు పంపించాము. వారు ఎచ్చటను కన్పించటంలేదు. కళకళలాడు చున్న వాళ్ళ జీవితములను నాశనముచేసాను. నేను యిచ్చటకు రాకుండావుంటే నా చెల్లాయి, తమ్ముడు ఎంతో ఆనంద దాయకముగా కాలమును వెళ్ళబుచ్చుచు, బాగా చదువుకొని ఎంతో బాగుగావుండేవారు; కాని అంతటిభాగ్యమునకు నోచు కోలేదు. వాళ్ళకొరకు ప్రతివూరు, పల్లె వెదకుచున్నాను. ఇట్లాగా ఆరునెలలు సునాయాసముగా కాలవాహినిలో కొట్టు కొనిపోయాయి.

కానీ నాకుకూడ నా చెల్లాయి, తమ్ముడు ఎచ్చటను కన్పించుటలేదు. అప్పుడప్పుడు ఆ జమీందారుని యింటికి వెళ్ళి తమ్ముడు, చెల్లాయి వచ్చారో లేదో తెనుసుకొనుచున్నాను. ఆనాడు మామయ్య వాళ్ళయింటిలో కన్పించాడు. ఏదో వ్యాపారవిషయము మాట్లాడుకొనుటకు వచ్చినట్లు వుంది. నన్ను చూడగనే ఆతని హృదయం ఆవేదనతో నిండుకొన్నది. నన్ను బ్రతిమాలాడు, యింటికిరమ్మని. తమ్ముని, చెల్లాయిని అడిగాడు. వాళ్ళ సంగతివిని దుఃఖించాడు. మామయ్యతో యింటి గడపవరకు వచ్చాను. కాని నా మనస్సు అంగీకరించు టలేదు. ఆ యింటి గడప త్రొక్కుటకు, అట్లాగే వెనుదిరి గాను. చిన్నాయన చనిపోయే స్థితిలో వున్నాడని తెలిసింది.

కడపటిసారి చిన్నాయనను చూచి మా యింటివైపు నడిచాను. అచ్చట యిల్లు కనపడలేదు. దానికిబదులు ముళ్ళచెట్లు, పచ్చిక దట్టముగా పెరిగివుంది. అచటనుండి మరల బయలుదేరాను. చెల్లాయి, తమ్ముడు కన్పించలేదు. ఈనాడు నా చెల్లాయి, యౌవ్వనములోవుంది. చెల్లాయిని సంఘపు పరిస్థితులు ఎల్లా మారుస్తాయో అనే శంక నాలో బయలుదేరింది. నాచెల్లాయి తనశీలాన్ని కాపాడుకొని జీవిస్తుందనే ధైర్యము నాలోవుంది. ఇంకొక ఆరునెలలు కన్నుమూసి, కన్ను తెరచినట్లు గడచి పోయాయి; ఇప్పటివరకు వున్నడబ్బుతో వూరులో తిరిగాను. కాని యీనాడు చేతిలో చిల్లిగవ్వయైనా లేదు; ఎల్లాగో ఒక వూరిలో చిన్నఉద్యోగము దొరికింది; దినమును చెల్లాయిని, తమ్ముని మనస్సులో తలచుకొని జీవితాన్ని వెళ్ళబుచ్చు చున్నాను. ఉద్యోగమునకుపోయి వచ్చినతర్వాత ఆ వూరి చెరువుగట్టుపై కూర్చునేవాడుక. అప్పటికి తొమ్మిదిగంటలు దాటినట్లుగావుంది. మనస్సు బాగా లేకపోవుటచే భోజనమునకు కూడబోలేదు; రాత్రి పదిగంటలు దాటితే మరల భోజనము వుండదు. కాబట్టి భోజనమునకు బయలుదేరాను. రెండు మూడు వీదులు దాటాను. ఒకచోట అందరు గుంపుగూడి వున్నారు. ఏమోనని నేనుకూడ ఆ గుంపులోనికి పోయాను. నా కండ్లను మొట్టమొదట నమ్మలేకపోయాను. మరలమరల కండ్లు నలుపుకొని చూశాను. నా తమ్మునికి ఒళ్ళంతా గాయములతోనిండి, రక్తపాతములో వున్నాడు. గాయముల

భాదను తట్టుకోలేక మూలుగుచున్నాడు.- ఇప్పటివరకు మనో స్మరణలేదు. కొద్దిసేపటికి మనస్స్మరణలోనికి వచ్చాడు. చుట్టు కలయచూస్తున్నాడు ఎవరికొరకో. ఆ నయనములు వెతకు చున్నాయి. తమ్ముడూ! ఏమిటీ రక్తము? అన్నయ్యా! వచ్చావా అన్నయ్యా! కడపటిసారి నిన్ను చూడాలని తహ తహలాడాను. నీవు కన్పించవని నిరాశ చెందాను. కడపటిసారి నిన్ను చూచుటకు నాకు భాగ్యముకల్గినది తనివితీర చూచాను. అక్కయ్యా! ఎట్లాపోయిందో! నా అక్కయ్యను కడపటిసారి చూచుటకు నోచుకోలేని అదృష్టహీనున్ని; తమ్ముడూ! తమ్ముడూ! ఎట్లాపోయింది. నీతోకూడ యింతకాలము లేదా! తమ్ముడూ! ఇంతకు మునుపు నా దగ్గరేవుండినది. ఆ రాక్షసులా భయమునకు ఎచ్చటికిపోయిందో! నాకు తెలియదన్నయ్యా! ఏమిటి తమ్ముడూ? నీ వింతమాటలు. వింత మాటలు కాదన్నయ్యా! పరమసత్యపు పలుకులు. కామ రాక్షసుల భారినుండి నా అక్కయ్య సుశీలత్వమును కాపాడుటను ధరించిన క్రొత్త దుస్తులు యివిఅన్నయ్యా! అన్నయ్యా! అబ్బా! అమ్మా! తమ్ముడూ! మాట్లాడవు మీ అన్నయ్యను! ఒక్కసారిచూడు తమ్ముడూ! ఒక్కసారి! అమ్మా! తమ్ముడూ! మాట్లాడవు? ఇప్పటివరకు చక్కగా నాతో మాట్లాడినావే! ఇప్పుడు మాట్లా డవూ! తమ్ముడూ! అన్నయ్యా!............

నా తమ్ముడు! మమ్మల్ని విడనాడి వెళ్ళిపోయాడు.

నా ముద్దుల తమ్ముడు! ఎచ్చటికో యీ బుద్బుదప్రాయమైన ప్రపంచాన్నివదలి ఎచ్చటకో వెళ్ళిపోయాడు. తమ్ముడూ! మీా అన్నయ్యను వదలి వెళ్ళిపోయావా! చెల్లాయ్! నీవుకూడ ఎచ్చటికి పోయావమ్మా! నీ తమ్ముని కడపటిసారి ప్రక్కన లేకుండా ఎచ్చటికి పోయావమ్మా! తమ్ముడుకొఱకు యిన్ని దినాలు కలవరించాను. వెదికాను. కాని కనబడి, చేతికి చిక్కినట్లెచిక్కి ఎచ్చటికో వెళ్ళిపోతారా! నేను ఎవరికొరకు జీవించాలి? ఎవరుండారని బ్రతకాలి? చెల్లాయ్! మనము తమ్ముణ్ణి కోల్పోయాము. కాని నీవు యిప్పుడు మీా అన్నయ్యనుకూడ కోల్పోయావు. మీా అన్నయ్యనుకూడ శాశ్వతముగా మరచిపోతల్లీ! మరచిపో! ఓ మృత్యుదేవతా! నా తమ్ముణ్ణి ఎట్లాగ నీదరికి చేర్చుకున్నావో! అట్లాగే నన్నుకూడ నీదరికి తీసుకో! రా! నేను సిద్ధముగా వున్నాను. భయపడకు నేనుకూడ ఒకమనిషినే! హా! హా! మా కుటుంబమునంతను నీలో ఐక్యముచేసుకున్నావు. నన్నుకూడ నీలో ఐక్యముచేసుకో! ప్రపంచములో ఎందరెందరినో ప్రతినిమిషము ఆలింగనము చేసుకుంటావు! అట్లాగ నన్ను చేసుకో! నీవు నన్ను ఐక్యము చేసుకోలేకపోతే నేనే వస్తాను. అని తన తమ్ముని పైకిఎత్తుకొని చెఱువులోనికి అడుగులు వేసాడు. ఒక శవము తనదగ్గర కన్పడినది; ఆ శవమును బయటికి తీసుకొచ్చాడు. ఆమె ఎవరోకాదు. తన చెల్లాయి. ఒక్కసారి తనివితీర చెల్లాయిని చూచాడు. మరియొకసారి తమ్ముని మోము చూసాడు. మెల్లగా చెఱువు

లోనికి అడుగులు వేసాడు. చల్లగా కన్నులు మూసాడు. ముగ్గురు మృత్యుదేవతకు ఆహారమయ్యారు.

 

తెల్లవారింది. ఆ వూరివారంతా వారి సహోదర ప్రేమకు సంతసించి, దుఃఖించారు. ఈ వార్త ఆ ధనవంతుని చెవిలో పడింది. అల్లే మూర్ఛపోయారు. సుశీల యీ మాటవిని దుఃఖసాగరములో మునిగింది. వాళ్ళ మామయ్య అట్లా నేలకూలిపోయాడు.

# నిరుద్యోగి

ఆనాడు అమావాస్య. ప్రియుడు, ప్రియురాలిపై కినుక వహించినట్లుగా కలువల మిత్రుడు కలువలపై కినుకవహించి తన యింటిలో మెత్తనిపాన్పుపై హాయిగా, చల్లగా ఒళ్ళు తెలియకుండా నిద్రపోతున్నాడు. సమయమును చూచి శత్రువుపై పగ సాధించుటకు ఎట్లాగ యుబలాటపడునో అట్లాగ ఆనాడు విద్యుద్దీపములు తమ దేదీప్య కాంతిని వెదజల్లు చున్నాయి. కొన్ని తమ కాంతి ప్రభావాన్ని చూపలేక నిరాశతో, నిస్పృహతో, త్రోవలో పోయేవారి తిట్లకుగురియై విధిలేక అట్లాగే నిలబడియున్నాయి. కొన్ని గ్రుడ్డిగా వెలుగు చున్నాయి. అప్పటికి పండ్రెండుగంటలు దాటింది. ఆకాశములో కారుమబ్బులు అచ్చటచ్చట గుమిగూడివున్నాయి. కొందరు బయటపడుకొని వృందువారు గుర్రుమని రాగాలాపన చేయుచున్నారు. తాతలకు, అవ్వలకు నిద్రరాకపోవుటచే తమతమ జీవిత పుటలను తిరగవేస్తున్నారు. కొందరి విద్యార్థుల రూములనుండి లైట్లు కిటికీలనుండి త్రోవలో పోయే వారిని చూచుచున్నాయి. అతను నైరాశ్యముతో ఎచ్చటికి

పోవాలో తెలియక గ్రుడ్డివాడులాగ నడచి ఎక్కడికో వెళ్తున్నాడు.

సన్నగా తుంపరులు పడుచున్నాయి హోరున గాలి వీస్తున్నది. కాకినుబ్బులు ఆకాశంలో షికారు కెళ్తున్నాయి. ఒక్కసారి గుబ్బుమనే రాగాలాపనలు నిలచిపోయాయి. ఇంతసేపు చెప్పుచున్న హరికధ చటుక్కున ఆగిపోయింది. అందరు గోవిందాయని పైకిలేచి, తమ తమ యిండ్లకు దారి చూచుకొని వెళ్ళుచున్నారు. కొన్ని సినిమా వాల్ పోస్టర్లు వానకు, గాలికి తట్టుకోలేక అతనివైపు అసహాయత్వముతో, దీనత్వముతో చూస్తున్నాయి. షికారు కెళ్ళిన కాకినుబ్బులు కొన్ని పార్కులకు, కొన్ని పొలాలవైపుపోయి కూర్చున్నాయి.

వాన తగ్గిపోయింది. అతనిలో నిరాశ, నిస్పృహ అతను మోయలేనంత బరువుగావుంది. ఆ బరువును తట్టుకోలేక కాళ్ళు తడబడుచున్నాయి. స్వేదబిందువులు వాటికి హద్దుపద్దులేకుండా కారుచున్నాయి. ఆ బరువును దింపుటకు ప్రపంచములో ఎచ్చటను చోటు దొరుకుటలేదు. ఎచ్చటనైనా కాస్తదొరికిన అచ్చట నిలబడితేచాలు, చీవాట్లకు అనుమానాలకు, అవమానాలకు తక్కువలేదు ఇప్పటికే అతనికి జీవితముపై విసుగెత్తింది. ఇక బ్రతుకుటకుకూడ అంగీకరించుటలేదు. "పుట్టించినవాడు రెండు మెతుకులు వేయడా! నారుపోసినవాడు నీరుపోయడా!" అనే మెట్టవేదాం

తము అతనిలో బాగా నాటుకొనిపోయింది. దానిని పెకలిం చుటకు శతవిధముల ప్రయత్నించుచున్నాడు. విఫలత్వమును పొందుచున్నాడు. అతనిలో ఆశ అనే దీపము కాంతివంతముగా యిన్నిదినాలు వెలిగింది, కాని యీనాడు గ్రుడ్డిగా వెలుగు చున్నది. రేపో! మాపో ఆరిపోయేటట్లు వుంది. రేపో, మాపో ఏమిటి? యీ క్షణములో కూడ ఆరిపోవచ్చు. ఇట్లాగ ఆలోచించుచు వెళ్ళుచున్నాడు. ముందరవుండే రాయినికూడ గమనించకుండా నడచినదానికి ఫలితము, బొటనవ్రేలు రాయిని ముద్దుపెట్టుకొంది. బాగా గాయము తగిలింది. అట్లాగే బాధతో నడచి వెళ్తున్నాడు. అతని రెండు నయనములకు సూటిగా బ్యాటరీలైటుపడ్డది. అట్లాగే నిలబడిపోయాడు. గుండెదడ ఎక్కువైంది. చెమట ముమ్మరంగాపట్టింది. కాళ్ళు తడబడుచున్నాయి. ఇద్దరు జవానులు ఎదురుగా వస్తున్నారు. ఇప్పుడు ఏమిచేయాలో అతనికి తెలియక అయోమయస్థితిలో పడ్డాడు. అతను, అతని నిజస్థితిని చెప్పితే నమ్మరు, అంతా అబద్ధమని, బూటకమని శ్రీ కృష్ణజన్మస్థానమునకు తీసుకొని పోతారు. అక్కడ ఆ రాత్రంతా వుండాలి. ఆ ఈగటీగల, ఆ దోమల సంగీతము వినాలి. అప్పుడప్పుడు కొన్ని కాట్లుకూడ వేసుకోవాలి ఇదంతా తలపుకు వచ్చేసరికి అతనిమనస్సు భయముతో కంపించిపోతున్నది.

ఇప్పుడు అబద్ధమును నిజముగా చెప్పకపోతే నే ॥

మార్గము, గతిలేదు. నిజస్థితిలో అతను దొంగకాడు. అతను దొంగ కాకపోవచ్చు, దగాకోరుకూడ కాదు. అతనొక నిరుద్యోగి అంతే. కాని వాళ్ళ దృష్టిలో అతను దొంగగా కనబడుతాడు. అంతేగదు! తాటిచెట్టుక్రింద కూర్చొని పాలు త్రాగుచున్నానంటే ఎవరు నమ్ముతారు. ఎవరిని నమ్మించ గలము? నమ్మించలేము. ఆ పరమాత్మని సాక్షిగా పిలిస్తే ఆయనకూడ అబద్ధము ఆడవలసి వస్తుందేమో! ప్రతిమానవుడు నిజము చెప్పవలయునని ప్రయత్నిస్తాడు. కాని తనచుట్టు వున్నపరిస్థితులు అబద్ధమాడమని ప్రేరేపిస్తాయి. ప్రేరేపించడ మేమిటి? అలా మారుస్తాయి. ఖచ్చితముగా అబద్ధమాడక పోతే అతనికి అప్పుడు అంతకంటే మార్గములేదు. యమ కింకర్లులాగ అతని దగ్గరకు వచ్చారు.

ఎవరునీవు?

నేనా! ఒక విద్యార్థినండి.

ఎందుకిలా తారాడుచున్నావు యింత కాళరాత్రిలో?

సినిమాకు పోయానండి, తలనొప్పిగావుంటే వచ్చే సానండి. వచ్చేటప్పుడు కాలికి బాగా దెబ్బతగిలిందిసార్. ఆ బాధకు తట్టుకోలేక నెమ్మదిగా పోతున్నాను. మాది యీవూరేసార్. చూడండి ఆ బజారువీధిలో 162 నెంబరు యిల్లండి. అని వాళ్ళు నమ్మేటట్లు కోతకోశాడు. అతని మాటలనునమ్మి వెళ్ళిపోయారు. వారినుండి బయటపడిన

దానికి అతని గుండెధైర్యమునకు, అతను గుండెకేచాలా "Thanks" అర్పించాడు. అట్లాగే పోతున్నాడు. గంగ జాతర యింకా రెండు, మూడు రోజులువుంది, కాని "Advertisements" మూట, ముల్లెకట్టుకొని టవున్ లోనికి దిగేసివున్నాయి. రికార్డ్సు పెట్టుచున్నారు. "కను పాప కనువైన కనులెందుకో!" అనే రికార్డు వింటూ అట్లాగే వెళ్తున్నాడు. "పూలమ్మినచోటనే కట్టెలమ్మగా జేసావా!" అంటున్నది రికార్డు. ఆ పాటనువింటు అట్లాగే పోతున్నాడు. వేరొకచోట "దిక్కులేనివారికి......ఆ దేవుడే! ఆ దేవుడే!" అని రికార్డు నిలిచిపోయింది. అప్పటికి ఒకగంట దాటింది. గబ, గబ అడుగులువేసుకుంటూ పోతున్నాడు. ఎందుకో? అంతతొందర, ఎచటికి పోవాలి? ఎవరిదగ్గరకు పోవాలి? అంత జోరులో పోవుచున్నావు? అని అతని మనస్సు ప్రశ్నించింది. ఆ ప్రశ్నతో నెమ్మదిగా నడచుటకు పూనుకుంది అతని కాళ్ళు. అతనిపరిస్థితి, అతని జీవితాన్ని తలచుకొంటే, ఒకప్రక్క సిగ్గు ఒకప్రక్క కోపము, చిరాకుకల్గుతుంది. అతను ఎందుకీలా మారిపోయాడు. అతనికే అంతు చిక్కటంలేదు. ఇప్పటికి ఆలోచించుచున్నాడు. బుఱ్ఱను బ్రద్దలు, బ్రద్దలుగా కొట్టినా కూడ జవాబు దొరకుటలేదు. ఎందుకిలా మారిపోయాడంటే, అతనికిమాత్రము ఏంతెలుసు? అతనికి తెలిసినదంతా ఏమీ లేదు. అతను కాస్త చదువుకున్నాడు. ఈనాడు అతనొక నిరుద్యోగిస్మె, పడరానిపాట్లుపడుచు, ఆకలిమంటలతో అలమ

టేస్తూ, ఆదరించే దిక్కులేక, నిలచుటకుకూడ చోటులేక, బికారియై తిరుగుచున్నాడు. ఒక్కొక్కసారి చావే శరణ్యమనిపిస్తుంది. అదే అతనికి మణిపూసగ కన్పడ్తుంది.

అతను యిప్పుడు ఎంతదూరము వచ్చాడో అని చూచే సరికి అతని కండ్లను అతను నమ్మలేకపోయాడు. అంటే అతను రైల్వేస్టేషనువరకు వచ్చాడన్నమాట. టవున్‌నుండి సుమారు నాలు మైళ్ళు యేలాటి ప్రయాసలేకుండా యింత దూరము వచ్చాడు. టిక్కెట్లు తీసుకొని లోనికిపోవు చున్నారు ప్రయాణీకులు. **Train** యింకొక పదునైదు నిమిషములలో వస్తుందని అందరు చాల ఆతురతతో చూస్తు న్నారు. **F. S.** వాళ్ళు ఏ పెట్టిలోఎక్కితే టిక్కెట్టు **Examiner** కు దిక్కకుండవుండుటకు వాళ్ళ, వాళ్ళకు కలిగిన **Ideas, Plans** చెప్పుకొనుచున్నారు.

అతను స్టేషనుదగ్గఱకు ఎందుకు వచ్చాడో అతనికే తెలియదు. అట్లాగే స్టేషనుదాటి రైలుపట్టాలలో రెండు మూడు ఫర్లాంగులు దాటాడు. ఆ పట్టాలపై అట్లాగే కూర్చు న్నాడు. గత జీవితము ఒక్కసారి తలపుకు వచ్చింది. ఏమిటా గత జీవితము? మనముకూడ కాస్త తెలుసుకోవాలి. అతను పుట్టినతర్వాత తల్లిని, తండ్రిని కోల్పోయాడు. కాస్త వున్న ఆస్థికూడ పోయింది. తన జేజదగ్గర యిన్నిదినాలు పెరిగాడు. ఆమె కాస్తవరకు చదువుచెప్పించింది. అతనిని

ంతో ఆప్యాయతతో పెంచింది. కాని ఎన్ని దినాలు బ్రతికినా ఒక్కనాటికి పోవలసినవాళ్ళమేకదా! పుట్టినవారు తింపక తప్పదు. కాయలుకాచిన చెట్టు దెబ్బలు తినకమానదు న్నట్లు ఆమె ఒకనాడు చల్లగా కన్నులుమూసినది. ఇప్పటికి తని వయస్సు పదునెనిమిది సంవత్సరములు. తన జేజ ఇచ్చిపోయిన ఆస్తి ఒక ఎకరాభూమి. అతను యేలాగు వెస్తాడు, ఉద్యోగము కొరకు కాకిలాగ తిరిగాడు. ప్రతి ఆఫీసుగడప త్రొక్కాడు. పెద్ద, పెద్ద వాళ్ళకాళ్ళను పట్టు కున్నాడు. కాని లాభము లేకపోయినది. ఆ వున్నకాస్త భూమిని అమ్మివేసాడు. దానితో ఒక సంవత్సరపురోజులు గడచిపోయాయి. ఈ సంవత్సరపురోజులలో సుమారు మాటికి తన్కువలేకుండా అప్పులు కేసన్నువేసాడు. ఒక్కదానికి కూడ తిరుగులేదు. ఈనాడు యిల్లువిడచి, పిచ్చిగా ఆలో చిస్తూ బయలుదేరాడు.

ఆ పట్టాలపై అట్లాగే పడుకున్నాడు చచ్చిపోవుటకు. రైలు రెండుఫర్లాంగుల దూరములో వస్తున్నది. గుండెదడ ఎక్కువైనది. ఇంతకాలము బ్రతికి యిదేనా చావు! నీవు వరిస్తావు? నీవు చచ్చిపోతావు కాని నీవల్ల ఎన్ని కుటుంబాలను ద్రోహముచేస్తావో ఒక్కసారి ఆలోచించుకో. తుదకునీవు నక్కలకు, కుక్కలకు ఆహారమవుతావా! చచ్చే వాడివి యే పనికిరాని గుంటలోనో పడి చచ్చిపో? నీవల్ల ఎవరికి

చేదు, చింతలేదు, పో? వెళ్ళిపో? అని అతని మనస్సు ఆదేశించి నది. అతనుమాత్రము యేంచేయగలడు. చచ్చి సాధించే దేమిటి? పిచ్చివాడా! లోకములో బ్రతికి సాధించాలి కాని చావేమిటి? యీ చిన్నవయస్సులోనే? లోకములో నీమాదిరి వాళ్లు లేకపోలేదు. కాని నాపనీకన్నా వేయిరెట్లు మెరుగు. అని మరల అతని మనస్సే ఆదేశించినది.

రైలుదగ్గరను సమీపించుచున్నది. పైకిలేచి కాలి బాటలో నిలబడ్డాడు. ఎన్నడూ చెప్పులు వేసుకొననివారు వాటిని యీడ్చుకొని ఎంత ఆయాసముతో, ఎంతో ప్రయాసతో సిగ్గుపడుచు ఒక్కొక్కసారి యే రాతికో కొట్టుకొని బోల్తాపడి యిక నడవలేక ఒకచోట నిలచిపోవునో అలాగ యింతసేపు తనను తగిలించిన పెట్టెలను యీడ్వలేక అతిప్రయాసతో స్టేషనులోనికి వచ్చిఆగింది. అతనుకూడ అతనికాళ్ళను యీడ్చు కుంటూ స్టేషనులోనికి వచ్చాడు.

ఇంతసేపు ఆ వుక్కలో వుక్కిరి బిక్కిరై అయిన ప్రయా ణీకులు త్రోసుకుంటు, కసురుకుంటు, అరచుకుంటు, సామా నులను భద్రపరచుకుంటూ తమ పిల్లలను చూచుకుంటు, జేబు దొంగల బారినుండి తప్పించుకుంటు టిక్కెట్టుకలెక్టరు దగ్గర టిక్కెట్లు పారవేసి బయటపడ్తున్నారు. ఇంతసేపు అలసి సొలసివచ్చినది కాబట్టి పదునైదు నిమిషములు సేదతీర్చుకొని కాస్త ఆహారము, నీరు తీసుకొని చాల వుత్సాహముగా లేచి

బయలుదేరుటకు సిద్ధమైనది. ఒక్క కూతకూసి, ప్రయాణీకు లను ఒక్క వూపు వూపి బయలుదేరింది. అతనుకూడ F. S ఎక్కాడు. అతనితోకూడ ఎందరో ఎక్కారు. కాని అతను మాత్రముఖుండే F. S. అందులో IInd Class Compartment లో ఎక్కాడు. అది ఎట్లావుందంటే అదిముందేకోతి. కోతిచేష్టలకు తక్కువలేదు. దానికి సారాయి త్రాగిపించి నట్లుగావుంది.

దానిలో ఎక్కిన ప్రయాణీకులు డబ్బుకలిగినవారు. హోదాలో వున్నవారు అతనిని అతని పరిస్థితినిచూసి వారు వేసుకొనిన దుస్తులు వెక్కిరించుచున్నాయి. కొన్ని హేళన చేస్తున్నాయి. కొన్ని జాలితో అతనివైపు చూస్తున్నాయి. వాటి చూపులకు అతను తట్టుకోలేక ఒకప్రక్కకు తిరిగాడు. ఇంతకాలము అతని జేబులో రెండు కాగితములు వుండేవి. వాటిని బయటికి తీసాడు. అతనిచేతుల్లో అవి గాలికి రెప, రెపమంటున్నాయి. వాటినిచింపి పారవేయాలనుకున్నాడు. కాని దానములలోకెల్ల విదానము గొప్పది అని చటుక్కున జ్ఞాపకమువచ్చింది. ఈనాడు వాటిని చింపివేస్తే అతనికి కలిగే లాభము శూన్యం. ఇంతకాలము వాటిని బ్రదపరిచావు. అట్లాగేయీనాడు కూడ పెట్టుకో అని అతని హృదయం చెప్పింది. ఇక విధిలేక గట్టిగా అట్లాగే పెట్టేశాడు. ఆ నిశీధ సమయ ములో చెట్లగుంపు, భూతములన్నియు గుంపుగాచేరివున్నాయా! అని అనిపించుతుంది. అక్కడక్కడ మినుకరబూచులు

తోసుకుమంటున్నాయి. చల్లటిగాలి ప్రతిఒక్కరిని ఒక్కొక్క ముద్దుపెట్టుకొనుచున్నది. కొందరు అట్లాగే ఆ ముద్దుకు తన్మయులై మురిసి, అట్లాగే మెల్లగా కన్నులు మూసారు. కొందరు రాజకీయములమీద పెద్ద ఉపన్యాసములు దంచు చున్నారు. కొందరు క్రాసుప్రశ్నలు వేస్తున్నారు. ఆ పరి సరమంతా చాల వృద్ధి కర్తతో నిండివుంది. మరిరొకప్రక్క సినిమాకక్ష బయలుదేరింది. ప్రతిఒక్కరిని చాల చెడ్డగా విమర్శిస్తున్నారు. ఎప్పుడో కొంచెము సేపు పొగడు చున్నారు. కాని అతను, రైలుమాత్రము యీ గొడవ నంతను పట్టించుకోకుండా అతని ఆలోచనలతో అతను, తనదారి వెంట రైలు పోవుచున్నది. అతనికికూడ కునుకుపట్టింది. అట్లాగే కన్నులుమూసాడు. సారాయి త్రాగినవాడికి ఎట్లాగా కైపు ఎక్కుతుందో అతనికి అలాగ బాగా నిద్రపట్టింది. తా పాడు ప్రపంచమునుండి బయటపడి విశ్రాంతి లోకంలో విహా రించి, అలసి, సొలసి అచ్చటకూడ నిద్రపోవుచున్నాడు.

ఎవరో తట్టిలేపారు. గాభరాతో, నిద్రమత్తుతో లేచాడు. తీరా చూచేసరికి గుండె ఝల్లుమన్నది. అతని కండ్లు తన వర్ణమునాతను కోల్పోయి తేలకండ్లువేసింది. భూమి, మిన్ను ఒకటిగా కన్పడుచున్నది. మాటలేక అట్లాగే నిలబడివున్నాడు. టిక్కెట్టుసార్ అన్నాడు టిక్కెట్టు కలెక్టరు లేదుసార్ అనిమాత్రము అనగలిగాడు. అతను అతనిని వదలి అందరిదగ్గర టిక్కెట్లుచూసి మరల అతని దగ్గరకు వచ్చాడు.

అతనిమీద అరగంటసేపు నూరుపదాల స్పీడుతో ఒక చిన్న ఉపన్యాసమిచ్చాడు. అప్పుడు అతని ప్రక్క ఒక Shorthand writer వుంటే ఎంతో బాగావుండేది. రాజకీయవాదులు, సినిమాకళావాళ్లు కొంచెముసేపువిని తమ, తమ ఉపన్యాసములలోనికి దిగారు. రైలు ఒకకూతకూసి ప్లాట్‌ఫారమువద్దకు వచ్చి ఆగింది. అందరు ప్రయాణీకులు వెళ్తున్నారు. అతను మాత్రము అతని వెంటబడే పోవుచున్నాడు. కాని అతని మనస్సుమాత్రము అతనిని విడిచి ఎచ్చటికో ప్రయాణమై పోయింది. ఇప్పుడు అతనే మిగిలివున్నాడు. అతనిని స్టేషను మాస్టర్ వద్దకు తీసుకొనివచ్చాడు. స్టేషనుమాస్టరుతో అతనిని కొంచెముసేపు మాట్లాడి, అతనిని ఒకమూల కూలబడమని చెప్పి వెళ్ళిపోయాడు.

అతను సరిగా అన్నముతిని ఒకరోజుదాటింది. అతనిని విడిచిపోయిన మనస్సు ఎచ్చటెచ్చటికోపోయి, వింత వింత స్థలములనుచూచి అతనిని వెదకి అ త ని లో ప్రవేశించింది. అతని నయనములు చింతనిప్పులాగ వున్నాయి. శరీరము కొంచెము వేడిగావుంది. ఇప్పటివరకు టిఫిన్ తినలేదు. భోజనముచేసి ఒకరోజుదాటిందని చెప్పానుగదా. రవిమూర్తి తన ప్రచండతేజస్సును లోకులకు చూపించుచున్నాడు. వేడిగాడ్పులు అప్పుడప్పుడువచ్చి శరీరమునకు వెచ్చదనము కలుగజేస్తున్నవి. స్టేషనుమాస్టరుకూడ భోజనమును పూర్తిచేసు

కాని బాహ్యమంటు తేపుకూ కుర్చీలో కూర్చున్నాడు. అటూ హామును కలియచూస్తాడు. అతని మట్టునున్న ఆఫీసు వస్తువు లతోపాటు అతనుకూడ కనబడ్డాడు. అతడు అతనినిచూచి జాలితో అతని చేయిపట్టుకొని పైకిలేపాడు. అతనిగుండె జాలితోనిండి ఒక్కసారి పైకుబికింది. అతనికి కాస్త ఆహా రము తెప్పించి, భోజనము చేయుచున్నాడు. అతని మంచి తనానికి, జాలికి వినమ్రతతో నమస్కరించాడు. అతనిని కొంచెము మందలించి వెడలిపోవుచున్నాడు. ఆ స్టేషనుప్రక్క ఒకపార్కు కనబడినది.

నిద్ర అతనికి తెలియకుండా వస్తున్నది. అ పార్కులోనికి నడిచాడు. అచ్చట పెద్ద పెద్ద బండలు పరచివున్నాయి. పూలచెట్లు చక్కగా పెరిగియున్నాయి. అచ్చటచ్చట పచ్చిక గుబురుగా పెరిగివుంది, ఆ పచ్చికలో సీతాకోకచిలుకలు ఆడుకుంటున్నాయి. అప్పుడప్పుడు వాటి ఆటకు తొండలు అడ్డువస్తున్నాయి. కొన్ని గులాబీమొక్కలు తమ, తమ అందమునుచూచి మురిసిపోతున్నాయి. గన్నేరుపూవునను కనకాంబరు పువ్వునను రచ్చనచ్చినది. అతనిని తీర్పు చెప్పుమని అతనిదగ్గరకు వచ్చాయి. అతను అంతటివాడినికాను అనిచెప్పి వాటిబారినుండి తప్పించుకున్నాడు. మల్లెపూవు అతనిని చూచి జాలిగా నవ్వుచున్నది. సన్నని పిల్లవాయువులు చక్క గానాసనను అతని ముక్కుదగ్గర వదలిపెట్టి తమదారిని

వెళ్ళిపోవుచున్నాయి. క్రోటనుమొక్కలు చాలఅందముగా పెరిగివున్నాయి. ఇప్పటికే అతనికళ్ళు కాలేదు, ఇక నిద్ర రాకపోతే వీలులేదు. అట్లాగే నిద్రపోయాడు.

నిద్ర లేచేసరికి సరిగ ఐదుగంటలుదాటింది. గ॥ గబ ముఖప్రక్షాళనము చేసుకొని నెమ్మదిగా వూరులోనికి వచ్చాడు. ఆ బజారంతా చాలా బిజీగావుంది. బాగా ఆఫీసులో పని చేసినవాళ్ళు అలసి, సొలసిపోయి ఎంతో ప్రయాసతో, ఆయాసముతో హోటలుగడపలు ఎక్కుతున్నారు. అచ్చటచ్చట కాలేజీస్టూడెంట్సు గుంపుగూడి Butterflies కొరకు నిరీక్షించు చున్నారు. రిక్షావాళ్ళ అరపులు, బస్సుల, లారీల శబ్దము పెద్ద భీభత్సముగావుంది. నీవు ముందా, నేను ముందాఅని కార్లు బస్సులు పందెము వేసుకొని పోతున్నాయి. ఎద్దుబండ్లు వెనకలపడిపోయి వాలుతూ, తూలుతూ పోవుచున్నది. ప్లాట్ ఫారమువద్దవుంచు మామిడిపండ్లను ఈగలు ముమ్మరంగా చుట్టుకొనివున్నాయి. పల్లెటూరి అవ్వలు, తాతలు బాగా తమ్మాకు వేసుకొని నమలి రోడ్డునంతా గలీజు చేస్తున్నారు. అతను అట్లాగేపోతున్నాడు. అతనికి ప్రతిఒక్కటి వింతగా కన్పడు చున్నది. చక్కటిమిద్దెలు చక్కటి అంగళ్ళు దీపాల వెలుగులో మిల, మిల మెరుస్తున్నాయి. త్రోవనపోయే ప్రతి ఒకరిని ఒక్కసారి మా అంగడి ఎక్కవోయి అంటున్నవి. ఇప్పటికి ఎనిమిదిగంటలు అయింది. సైరనుపట్టుచున్నది.

ఆకలి ఎక్కువగావుంది. అతని జానెడుపొట్ట యింతసేపుమనుష్య ఎన్నెన్నో నష్ట వ్యసనాసములకు గురియైనది. కాబట్టి యీ దినముకూడ అట్లాగే వుండదున్నాడు. అతని మాట ను దైవసావహించి వూరుకొంది. ఈరాత్రి ఎచ్చటవుండాలి, అర్థమేఅగుటలేదు. అట్లాగే నడచివెళ్ళగా ఒక చిన్న సత్రము కనబడినది. అతనిలాంటి అనాధలను, నిర్భాగ్యులను, బికారులను అది ఒక చక్కటి విడిదిగా కన్పడుచున్నది. అతనికన్న ముందు ఎందరెందరో నిద్రపోతున్నారు. అతనికి ఒక చిన్న తిన్నె కన్పడినది. దానిపై మూడుఅంగుళముల దూళి పేరుకొనియున్నది. ఇక విధిలేక అట్లాగే పడుకున్నాడు. ఒక్కసారి అతనిగడ్డలను చూచుకున్నాడు, పసిగడ్డమూదిరిగావుంది. క్రాపుచేసుకొని మూడునెలలుదాటింది. అతనికి గడ్డమువచ్చివుంటె యిప్పటికి ఒక అంగుళము వెంట్రుకలు పెరిగివుండును. కాని గడ్డము యిప్పుడిప్పుడు లోకమును తొంగిచూచుచున్నది. అతని పరిస్థితి యింతవరకువచ్చింది. తుదకు ఆ పరమాత్మునికి కూడ అతనిమీద కాస్తకూడ దయలేకుండాపోయింది. ఆ దైవమే అతనిజీవితానికి ఒకచక్కటి వూతఅనుకున్నాడు. కాని అది కలలోగట్టిన గాలిమేడలు. అంతకంటె అవేమీకావు. ఇట్లాతలచుచుంటూ అట్లాగే కన్నులుమూసాడు. నిద్రలేచేసరికి భళ్లున తెల్లవారివుంది, ప్రతి అవయవము నీరసముతో నిండి లేచుటకుకూడ సత్తువలేకయున్నది. సూర్యభగవానుడు విల్లును బాణమును తీసుకొని లోకంపైకి దండెత్తుటకు వస్తున్నాడు.

ప్రతియింటి చక్కటి రంగవల్లికలనువేసి ఆనందించుచున్నారు ఎట్లాగోలేచి ముఖప్రక్షాళన చేసుకొనుటకు టేప్‌దగ్గరకు వెళ్ళాడు. అప్పటికి పోట్లాడిఅలసిపోయిన సింగముల్లాగ గసపెట్టుచున్నారు. ఇప్పుడప్పుడు సంస్కృతపదములుకూడ వాటికి హద్దుపద్దూ లేకుండావస్తున్నాయి. అతను బ్రతిమాలుకుంటు కసురుకుంటు తొవృపదిలారు. బిర, బిర పనిచూసుకొని వారినుండి బయట పడ్డాడు. ప్రతిప్రేపు ఆవులించుచున్నది. చేతిలో ఒకనయాపైసా కూడాలేదు, ఎట్లావుంటుంది అతనిదగ్గర. వున్నసొత్తుఅంతా దౌర్భాగ్యము. అదిఎప్పుడును అతనిని విడనాడదు. అతను దానినుండి తప్పించుకొని ఎచ్చటికైన పారిపోయినకూడ అది అతనిని మరల కలుసుకొనుచున్నది. అతను మాత్రము యేంచేయ గలడు? తెల్లవారిఅగుటచే ప్రకృతి చాల రమణీయముగావుంది. ఆకాశదేవత తెల్లటిచీరను కట్టుకొని. చాల నాణ్యముగా కన్ప డుచున్నది. ఆకాశవాణినుండి చక్కటి తెలుగున్యూసు వీనులకు హాయినిగొల్పుచున్నది. గమ, గమమని సువాసనలు హోటలు నుండి వస్తున్నాయి. విద్యార్థులు చక్కటిడ్రస్‌తో హోటలు గడపలను దిగుచున్నారు. అతనికి ఒక పాతస్నేహితుడు కన బడ్డాడు. కులాసాగా కబుర్లుచెప్పుకుంటు హోటలు గడపలను ఎక్కాడు. బిల్లుచెల్లించి అతనిస్నేహితుడు పనిమీదపోవలయునని వెళ్ళిపోయాడు అతనికమనస్సులో కృతజ్ఞతలను చెప్పుకున్నాడు. అచ్చట రీడింగ్‌రూముకన్పడినవి. ఏదైన Wanted Calumn లో అతనికితగినది కన్పడుతుందేమోనని వెదికాడు. కన్పడలేదు

నిరాశతో బయటికినడిచాడు. అతని జీవితములో ప్రతి అడుగడుగునను నిరాశ ప్రత్యక్షమగుచున్నది. ఏపనికి పోయినప్పుడెల్ల నుక్కెదురు. అతనుమాత్రం యేంచేయగలడు? ఇప్పటి అంటే రెండు సంవత్సరములనుంచి ఎన్నెన్నో అప్లికేషన్ ఫారములు రకరకాల వుద్యోగములకు వేసాడు. ఒకదానికికూడ తిరుగులేదు. వుద్యోగములేక, ఆదరించేదిక్కులేక యీనాటికి యిలాపూరాడు. ఇక వుద్యోగమువస్తుంది అనేది కలలోనిమాట. ఇకమీదట యేపనినైనను చేయుటకు నిశ్చయించుకున్నాడు. ఏపనినైనా అంటే దొంగపనికాదు. అదితప్పు. అట్లాగే ఆలోచించుకొనుచు వెళ్తున్నాడు. రోడ్డంతా చాల బిజీగావుంది. ఒక్కసారి అతని పేరుపెట్టి పిలిచారు. వెనుతిరిగి చూచాడు. అంతగుంపులో అతనికి తెలిసినవాళ్ళు ఎవరూకన్పడలేదు. ఎన్నోసార్లు అతని పేరుపెట్టిపిలిచారు. అతనికిమాత్రం పిలిచేవ్యక్తి కనబడలేదు. అతనేవచ్చి కలుసుకున్నాడు. అతను ఎవరోకాదు. ఒకనాడు అతనికి, వాళ్ళయింటికి Close friend, ఈనాడు రిక్షాలపై పెట్టుబడిపెట్టి లాభాలు గడించుచున్నాడు. అతని మనస్సులో రిక్షాత్రొక్కైనా జీవిస్తానని అనుకున్నాడు. అదే అతనికి గతి. ఇంకేమిలేదు. అతనుమాత్రము యిష్టపడతాడో, యిష్టపడడో అనేది ఒకప్రశ్న. ఎట్లాఅయితేనేం అతను రిక్షాత్రొక్కి జీవించాలనుకున్నాడు.




శేఖర్! నేను చెప్పేదివిను. చదువుకున్నవాడికి సంఘము

కులో గౌరవముగలవాడివి నీవే నిరుత్సాహపడితే యింకేముంది శేఖర్. జీవితమే ఒక కురుక్షేత్రమువంటిది, అందులో మనము మే భీమార్జునులము కాకపోతిమి. జీవితములో ఎన్నెన్నో విఘ్నాలు అడ్డుతగులుతూ వుంటాయి. వాటిని మనము ధైర్యముగా ఎదుర్కోవాలి. చూడు శేఖర్! ఆనాడే గాని దేశమంతట చచ్చినవాళ్ళల్లాగ నిరుత్సాహవంతులైవుంటే, నీమాదిరివాళ్ళు వుండివుంటే యీనాడు మనకు స్వాతంత్ర్యము వచ్చేదా! ఆనాడు, యీనాడు ప్రకృతిని జయించలేమని కూపస్థమండూకమువలె కూర్చొంటె యీనాడు యిన్ని ఘనవిజయాలు సాధించేవాడా! చూడు శేఖర్! ఒకనాడు స్త్రీలు అబలలు అన్నారు. స్త్రీలు అబలలు కాదని సబలలు అని నిరూపించుకొనే కాలములో నీవు నిరుత్సాహవంతుడివిగా మారటము నాకు అవమానముగా వుందోయ్!

బ్రదర్! జీవితమే అంధకారబంధురమై పోయినది. నా జీవితపు బాటను నీవు చూచివుంటే, అందులోని కష్టము! నా జీవితపు బాట అందరి జీవితపు బాటలాగ లేదు. ఒక ఫర్లాంగు దూరముగాడ చక్కగా లేదు. అన్నీ తిరుగుళ్ళు. అన్నీ మలుపులు. ప్రతి అడుగడుగు పల్లాలు, అందులో దట్టమైన ముండ్లచెట్లు. దానిలో నేను ప్రాణము బిగపట్టుకొని యింత కాలము అతిప్రయాసతో, బాధతో నడిచాను. ఈనాటినుంచి దానిలో నడువలేను. ఇకమీదట ఒక్క అడుగుకూడ వేయలేను

నా బాటను యే ఇంజనీరు బాగుచేయలేడు. ఇది నగ్న సత్యం. బ్రదర్! నా జీవితమే ఒక ఎండిన మ్రోడులాగ తయారయింది. దానికి నీవు ఎంతనీరుపోసిన, పుట్టలో పాలు పోసినట్లే, పామునకు అహింసాతత్వాన్ని భోధించినట్లు. అది యిక చిగురించదు. అది యిక అగ్నిదేవునికి ఆహారమై పోవలసినదే, అంతకంటె అది యికదేనికి పనికిరాదు. నిరాశ, దౌర్భాగ్యము యీనాడు నాసొత్తు. చూడు బ్రదర్! ప్రతి వుద్యోగానికి అప్లికేషన్ఫారములు వేసాను. ఒకదానికికూడ జవాబులేదు. ప్రతి వుద్యోగానికి లంచము కావాలంటారు. లేకపోతే ఎంతపోడుగునా, సిఫారసు తెచ్చావు అంటారు. బ్రదర్! యీనాడు నిన్నడిగేది ఒకరిక్షా. దానిని త్రొక్కి జీవించాలి అని నామనస్సులో తీర్మానించుకున్నాను. నీవు ఆదరిస్తావని, నీవు చేయూతనిస్తావని, నీదగ్గరకి వచ్చాను. నీవు యిస్తానంటే ఒకటి తీసుకుంటాను. లేకపోతే వచ్చినదారినే వెళ్ళిపోతాను.

అదికాదు శేఖర్! నీవురిక్షాత్రొక్కితే నిన్ను సంఘములో యేమని గౌరవిస్తారు. నీమీద ఎంతవిలువ చూపుతారు? నిన్ను వెక్కిరిస్తుంది, వేలుపెట్టి చూపెట్టుంది. అంతేకదు బ్రదర్, యింకేమన్నా చేస్తుందా చూడు బ్రదర్ నీతి, నిజాయితీకలవాడు యెటువంటిపనిచేసిన అది రాణిస్తుందని ఒకనాడు మహాకవి శేఖరుడు అన్నాడు. సంఘము నవ్వుతుందని, వెక్కి

సేస్తుందని, వేలుపెట్టి చూపెట్టుందనిగదు నీవుచెప్పేది? అది కాదు బ్రదర్ నాకు ఒకనాడు అన్నములేకపోతే నన్ను ఆదరించినదా! కడుపులో భగభగమని మండుచుంటె యీ నీతులు యేంచేస్తాయ్ బ్రదర్!

శేఖర్! నీవు రిక్షా త్రొక్కగలవా? అందులో యీ పూరు క్రొత్త, నీవు ఖచ్చితముగా కావాలంటె నేను మాత్రము చేసేదేమిటి? తీసుకో బ్రదర్ నీ యిష్టమొచ్చింది.

ఎన్నడు దానిని త్రొక్కుట కలవాటు లేకపోవటంవల్ల కాళ్ళు పీక్కుతింటున్నాయి. ముచ్చెమటలు పోస్తున్నాయ్. ఆయాసంతో, బాధతో ఆ రాత్రి అలాగనే ఆ రిక్షాలోనే పడు కున్నాడు. గాఢంగా నిద్ర రావటముచేత అట్లాగనే నిద్ర పోయాడు. తనకు లోకానికి సంబంధములేదని గురుకపెట్టి నిద్రపోవుచున్నాడు. ఆనాడు అమావాస్య. చంద్రుడు మేలిముసుగు వేసుకొని నిద్రపోవు కన్యలాగ నిద్రపోవు చున్నాడు. అప్పుడే నాలుగుగంటలబండి చీకటిని దూసు కుంటూ ప్లాట్‌ఫారము దగ్గరకు వచ్చింది. ఆ చీకటిలో గుంపు ఒకరినొకరు త్రోసుకుంటూ, నెట్టుకుంటూ బయటపడ్తున్నారు. కాని శేఖర్ మాత్రము రిక్షానుండి లేవలేదు. పరిక్షా! విన్నే కదూ పిలిచేది? ఆ శబ్దముతో నిద్రనుండి లేచాడు. తన గుడ్డి దీపాన్ని వెలిగించాడు, వాళ్ళను కూర్చోబెట్టుకొని చక, చక

మని యెన్నెన్నో వీధులు దాటిపోతున్నాయ్. శేఖర్ మనో వీధిలో యెన్నెన్నో ఆలోచనలుకూడ పరుగెత్తున్నాయ్. మూడు యీ వీధులపేర్లు తెలియకపోతే రిక్షా ఎందుకు త్రొక్కాలి?

క్షమించు మేడమ్, మీరు చెప్పినట్లు నాకు యీవూరు క్రొత్త, అందులో నా జీవితములో రిక్షాత్రొక్కడంకూడ క్రొత్త. కాని కాలప్రవాహములో యెన్నెన్నో విచిత్ర సంఘటనలు జరుగుచుంటాయ్. అలాగే నా జీవితములో కూడ! కావున యీ నాడు బికారినై పడరాని పాట్లుపడు చున్నాను. ఒకనాడు శేఖర్! నీకు మంచి భవిష్యత్తుందోయ్ అనినవానికి యీనాడు తినడానికికూడ తిండిలేక, కాలసర్పానికి చిక్కి ప్రాణముమీద ఆశవదలుకుంటున్నారు. సుశీలా! యీ రిక్షాత్రొక్కేది ఎవరోకాదు "శేఖర్"ని"

 

శేఖర్! యిచ్చటనే నిలిపే నేను మా యింటికి నడచి పోయెదను. నిన్ను యింతదూరము కష్టపెట్టినందులకు క్షమించు. శేఖర్! నీవు రిక్షాత్రొక్కవలసిన పరిస్థితులు ఎందుకు ఏర్పడ్డది. అదికాదు సుశీలా! విధినామీద పగ బూనినది. పగను తీర్చుకొంది. నన్ను యీలా తయారు చేసింది. సంతోషించింది. ఈగతికి తెచ్చి విడిచిపెట్టింది, అంతేసుశీలా! అంతేఅని రిక్షా త్రిప్పుకొని చకచక వీధిమలుపు తిరిగి వెళ్ళిపోయాడు. సుశీలా ఆశ్చర్యముతో అట్లాగేచూస్తూ నిలబడిపోయింది.

# "టెల్గ్రామ్!"

ఓ! మిస్టర్ రాము! రారా నీకోసరము పోస్టుమేన్ వచ్చాడురా! రా! పోస్టుమేన్ వస్తే ఏదో వుత్తరము ముక్క యిస్తాడు. దానిని తీసుకోలేవా! దానికోసరము ఎందుకిట్లా అరుస్తావు? మంచి Problem వర్క్ చేస్తువుంటే disturb చేస్తావు. నిన్నెవరు పిలిచేది? ఆ పాడు Logic కు సలాము చేసిరారా! అది చదివినా అర్థముకాదు. ఒకవేళ అర్థమయినా కాస్తకూడ బుఱ్ఱలో నిలువదు. నీవేమంటె ఒకమూల కూర్చొని disturb అని నన్ను సమాధానపరుస్తున్నావు? పోస్టుమేన్ అర్జంటుఅంటాడు. నీకేదో టెలిగ్రాము వచ్చిందంట రారా! ఆయన పోవాలంట. వస్తున్నాను ఎందుకు అలా కేకలేస్తావు?

సార్, టెలిగ్రాము ఎచ్చటనుండి వచ్చిందిసార్? మనకు టెలిగ్రాము కొట్టేవాళ్ళులేరు. అది యిలా యివ్వండి. "మీఅమ్మ వున్నట్లుండి హృదయ హృద్రోగమువలన మరణించినది. తక్షణమె బయలుదేరవలయును". అని చదువుచు అట్లాగే కుప్పగా నేలను వొరిగిపోతాడు. అతనికి మిన్ను, భూమి

ఒకటేగాక్రిస్పడినది.

అమ్మ చనిపోయింది బ్రదర్! ఇక ఎవరిని ఏమని పిలిచేది బ్రదర్! కడపటిసారి అమ్మ నాకొరకు ఎట్లా అల్లాడినదో! చెల్లాయిలు యీ స్థితిలో ఎట్లావుండారో! ఇప్పుడే వెళ్తాను బ్రదర్. నిన్న వెళ్ళవద్దని ఎవరు చెప్పారు. ట్రెయిన్ అన్నా బస్సన్నా వుండద్దు. ఈవానలువచ్చి బస్సులు నిలచిపోయాయి. ట్రెయిన్సమాత్రము లేట్ గావస్తున్నాయి. బస్సులులేక పోతే గుఱ్ఱపుబండ్లు వుంటాయిగదూ! ఏమిట్రా ఆలా మాట్లాడుతావు? పిసు మతిపోయిందా? బస్సులే పోకపోతే గుఱ్ఱపుబండ్లు ఎట్లా పోతాయి? నేను యిప్పుడే పోవాలి! అమ్మను చూడాలి.

బ్రదర్! జీవితములో మనము కలుసుకుంటామోలేదో! ఇక నా చదువు యింతటితో సమాప్తమవుతుంది. కాని బ్రదర్! నివు బాగా చదువుకో! అప్పుడప్పుడు వుత్తరములు వ్రాయి. మన స్నేహవృక్షరాజము యిన్నిదినాలు దిన, దినాభి వృద్ధియై, ఎన్నెన్నో శాఖలు వేసి, ఎన్నెన్నో పుష్పాలుపూసి, ఎన్నెన్నో పిందెలుతొడిగి పరిపక్వమునకు వచ్చుసమయమైనది కాని వానిని ఎవరో మొదలునకు నరకివేసారు. బ్రదర్ యిక వస్తాను. యీచింత పెట్టుకోకు నీవు రేపు పరీక్ష వ్రాయాలి. బాగా చదువుకో. ఇక వస్తాను బ్రదర్.

ఆరాత్రిలో స్టేషనుప్రక్క బయలుదేరాము. కాని ట్రెయిన్ లేటుగా వస్తుందన్నారు. కొద్దిసేపటికి ట్రెయిన్

వస్తేరావచ్చు, లేకపోవచ్చు అన్నారు. అట్లాగే ఆ రాత్రిలో బయలుదేరాడు. ఎప్పుడూ నడవని స్పీడుతో పోవుచున్నాడు. ఆకాశమునంతను కారుమబ్బులు క్రమ్మివేసాయి. ఒకప్రక్క చలి మిక్కుటముగావుంది. చుట్టుచూస్తే ఒక్కొక్క భూతము లాగ కన్పడుచున్నది. కీచురాళ్ళధ్వని మిక్కుటముగావుంది. ఒక్కొక్కసారి పరుగులుతీస్తూ సుమారు ముప్పై నలభైమైళ్ళు నడిచాడు. ఒక చిన్నస్టేషనులో రైలు కన్పడినది. గబ, గబ మని దానిలో ఎక్కాడు. అప్పటికి భళ్లున తెల్లవారివుంది. పాపము యింతదూరము నడచివచ్చాడు కాబట్టి, యిన్నిదినాలు పరీక్షలకు మేల్కొన్నారు కాబట్టి, కొంచెముసేపు కన్నులు మూసాడు. సరిగ పదిగంటలకు వూరుచేరాడు. పరుగులుతీస్తు ఒక్కొక్కవీధిని దాటుతూ, ఒక్కపరుగులో తనయింటిలోనికి ప్రవేశించి అమ్మకాళ్ళపైబడ్డాడు.

దహనక్రియలు జరిగిపోయాయి. వచ్చిన బంధువులు కాస్త ధైర్యముచెప్పి వెళ్ళిపోయారు. కాలప్రవాహములో ఆరు నెలలు దొర్లిపోయాయి. స్నేహితునిదగ్గరనుండి రెండు, మూడు లేఖలు వచ్చాయి. రిజల్ట్సువేసారు. ఇద్దరు రెండు పార్టులలో పాసయ్యారు. ఒక్కదానిలో తప్పిపోయారు.

అమ్మా లలితా! మీ అయ్యవారు వచ్చారమ్మా! నీవు పరీక్షలలో యెట్లావ్రాసావు అని అడుగుచున్నారు నమస్కారముసార్! యీబాపమీద కూర్చోండి. చాలాదినాలకు

కన్పడ్తున్నారు. ఏమిలేదమ్మా, పనులు సరిగవ్రాయటున్నాయి. కాబట్టి రాలేక పోతున్నా సుశీలా. అమ్మా లలితా! ఇంట్లో యేమిచేస్తున్నావు? భోజనము చేస్తున్నా అన్నయ్యా వస్తాను. సార్! బాగా వ్రాసానుసార్. ఈసారికూడ నాదే ఫస్ట్ మార్కు వస్తుందిసార్. నీకురాకుండా ఎవరికి వస్తుంది. పో! అమ్మా. పో సుశీలా! నీవుకూడ యెదైనా పనిచూచుకో పోమ్మా.

చూడు రాము, ఎన్నిదినాలు సుశీలకు వివాహాము చేయకుండా వుంటావు? స్కూలుఫైనలు పరీక్షకూడ పాసయ్యె రెండుసంవత్సరములు దాటిపోయింది. స్కూలుఫైనలు చదివే టప్పుడే చేసేదున్నాను. కాని ఎవరికి యిష్టములేకపోయింది. అప్పుడు అయిష్టము చూపావుగదూ! అప్పుడు నా మీద కోపమువచ్చింది. అయిపోయినదానికి చింతించవలసిన పని లేదు. ఇక జరుగబోయేదానిని ఆలోచిస్తేచాలు. ఇంకా వివాహాము చేయకపోతే సంఘము పకరకాలుగా తలుస్తుంది. లేనివి, పోనివి చెప్పకొంటుంది. నామాటవిని త్వరగా వివాహాముచేసే. సార్! నా చెల్లాయికి పెండ్లి చేయకూడదని నేను ఎప్పుడైనా తలుస్తానా! ఎవరైనా వస్తేగదూ ముందుకు. వరకట్న పిశాచము వీరవిహారము చేయుచున్న మనసంఘములో మీబోటివాళ్ళు దానిధాటికి తాళలేక మల, మలమని మాడి పోతున్నాము. బి. ఏ. లు ఎం. ఏ. లు, ఇంటర్లు చదివిన వాళ్ళు పది వేలిస్తావా! లేకపోతే కనీసము ఐదు, ఆరు వేలు లేనిదే

ండి పీటమీాదకు రాను అని చెప్పే మన సంఘములో నా బోటి
డు అంతడబ్బు ఏలాయిచ్చుకుంటాడు. పెండ్లికూతురును
గార్కెట్టు-లో, కూరగాయలను బేరమాడి ఒక ధరచేసి
న్నమని చెప్తున్న రోజుల్లో నేను ఏలాగ సుశీలకు పెండ్లి చేయ
లను. మీాకు తెలిసినదేగదూ, యీా యిల్లుతప్ప యింకేమి
దు. ఓహో అంటే వెయ్యిరూపాయలు యిస్తారేమిా! నా
దువుకు రెండువందలు అప్పుచేసారు. దానిని తీర్చివేయాలి.
గతదానితో సుశీలపెండ్లి కావాలి. నేనుమాత్రం యేమి
చేయగలను. నాకు వుద్యోగము లేదాయె. మీారే చెప్పండి
సార్! ఎవరికాళ్ళమీాదైనాబడి పెండ్లి చేసేనాయనా! ఇక
వస్తాను. బోలెడు పనులున్నాయి. ఇనస్పెక్టరు వస్తాడంట.
ఈ ఇనస్పెక్షన్లను తక్కువలేదు. కాని జీతాలుమాత్రము
పెంచరు. అది అడిగినప్పుడు వాళ్ళకు చెవులు వినబడవు.
ఇల్లావుంది మా పరిస్థితి. ఇక వస్తాను. మంచిదిసార్.

ఆ రాత్రంతా ఎన్నోన్నోవిధాలుగా ఆలోచించాడు.
కడపట ఒక నిశ్చయానికి వచ్చాడు. ఏమని ఆనిశ్చయము,
అంటే తన స్నేహితునికే తన చెల్లాయినియిచ్చి పెండ్లిచేయా
లనుకున్నాడు. ఎట్లయినా తనస్నేహితుని తల్లి, తండ్రులను
ఒప్పించవలయునని శెల్లవారితో బయలుదేరాడు ఆ ఆలోచన
తోనే వూరుచేరాడు. అప్పటికి సాయంకాలము దాటింది.
మిత్రుడు, మిత్రులను తనివితీర చూచుచు పడమటికొండల
లోనికి జారిపోయాను. స్నేహితుణ్ణి పొలముదగ్గర కలుసుకొని

కుశలప్రశ్నలు వేసుకున్నారు. తన పరిస్థితినంతా తను దేనికి వచ్చినదంతా పూసగ్రుచ్చినట్లు చెప్పుకొన్నాడు. తన చెల్లాయిని పెండ్లి చేసుకోమని దీనత్వంతో స్నేహితుణ్ణి ప్రార్థించాడు. తన స్నేహితుణ్ణి మెప్పించుటకు సకలవిధముల ప్రయత్నించాడు. రాముూ! నీబాధ, నీఅవస్థ నాకు అర్థమైంది. ఇంతదూరము చెప్పవలసిన పనిలేదు. కాని నాపరిస్థితి నామాటనుకూడ వినాలి. నేను ఒకనాడు అంటే స్కూలుఫైనల్ చదివే రోజుల్లో ఒక యువతిని ప్రేమించాను. మాది నిర్మలమైన ప్రేమ. ఆ యువతితో స్నేహముచేసుకొనవలెనని ఎందరెందరో ప్రయత్నించారు. ఆమె క్లాసులో ఫస్టువచ్చేది. దానికి తగినట్టు అందము ఆమెకు దేవుడు ప్రసాదించాడు. కాని నేను ఒకనాడు నేనుగాఢాంగా ప్రేమింపుమని అడిగాను. ఆమె అందుకంగీకరించింది. అప్పటినుండి ఇప్పటివరకు ఆమె వూరికిపోలేదు. చదువుటకు పట్నం వెళ్ళినప్పుడు ఒక జాబు వ్రాశాను. దానికి బదులు వుత్తరంవచ్చింది. దానిలో రెండు విషయాలున్నాయి. ఒకటి బాగాచదువుకో, నీ ఆరోగ్యమును చాలాజాగ్రత్తగా చూచుకో నన్ను ఎన్నటికి మర్చిపోవద్దు. ఇది మొట్టమొదటి జాబులో సారాంశము. రెండవ దానిలో యూనివర్శిటీ పరీక్షలలో బాగారాయ్. రెండవ విషయం తనయింట్లో జరిగిన విషాద సంఘటన. యింత మాత్రమే మాలోజరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు. మాది నిర్మలమైనప్రేమ. చూడు రాముూ! నీవే ఆలోచించు. ఆమె

నన్ను నమ్మింది. ఒకరినినమ్మి ఎన్నెన్నో ఆశలుపెట్టుకొన్న యువతిని నిరాకరించితే ఆమె గతేంకాను? రామూ! నమ్మిన వారిని ఎట్లామోసంచేసేది? ఈ చేతుల్తో పచ్చటి జీవితాన్ని ఎట్లాపాడుచేసేది? కాని నావరకు ప్రేమించి వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నాను. వరకట్నాలమోజులో పాత కాలపు పద్ధతులతో చిగుళ్ళకని వివాహం చేసుకొనుట నాకే మాత్రం యిష్టంలేదు. ఒకవేళ అట్లాగ పెళ్ళిచేసుకొని లేని పోని గొడవలతో ఎందుకు సతమత మవ్వాలి? ప్రేమించిన యువతిని పెళ్ళిచేసుకొనవలెనని మొన్న మానాన్నను ఎన్నో విధాల ప్రాధేయపడి ఆవివాహమునకు వొప్పుకొనునట్లుచేశాను. చూడు రామూ! నీమాటలను త్రోసిపుచ్చానని కోపగించవు కదూ! ఈ విషయానికే కోపముచేసుకొనవలెనా శేఖర్! ఇక వస్తాను.

ఎంతో ఆశతో బయలుదేరివెళ్ళాడు. కాని నిరాశతో వెనుదిరిగాడు. ఇల్లుచేరుకున్నాడు. మూడురోజులు ముచ్చటగా గడిచిపోయాయి. ఆనాడు గౌరీవ్రతం. చక్కగా స్నానంచేసి యిల్లును శుభ్రపరచుకొని యింటిని చక్కని రంగవల్లికలతో తీర్చిదిద్దెను. తనచెల్లాయి వంటకుకావలసిన సామానుదెచ్చుటకు యింటినుంచి నాలుగడుగులు వేసెనోలేదో అతనికండ్ల నతడు నమ్మలేక పోయాడు. తనయింటిముందు బండివచ్చి ఆగింది. దానిలోనుంచి ఒక పెద్దముసలాయన ఒక ముత్తైదువ ఒక

చక్కటి యువకుడు చక్కటి డ్రస్సుతో దిగాడు. అతనెవరో కాదు. తన స్నేహితుడు శేఖర్!!! వాళ్ళను కలుసుకొని యింటిలోనికి తీసుకొచ్చాడు. శేఖర్‌ని చూడగనే సుశీలమనస్సు పరమానందముతో నిండి ఒక్కసారి తనివితీర అతనిని చిరునవ్వుతో కలుసుకొంది. ఇద్దరు పెదవులలో చిరునవ్వు తొంగిచూచింది. శేఖర్ తల్లితండ్రులు సుశీలను చూడగనే తన కుమారునికి తగినసంబంధమని నిశ్చయించుకొని కాసేపు కుశలప్రశ్నలు వేసుకొని ముహూర్తమును పదునైదు రోజులలో జరుగునట్లు నిర్ణయించుకొని తమవూరికి బయలుదేరి వెళ్ళారు.

ఎన్నెన్నో సంవత్సరములు, యుగాలు గడిచిపోతూ వుంటే ఒక పదునైదురోజులు గడచుట కష్టతరమా! ముహూర్తపుతేదీ దగ్గరకు వస్తుందనగానే తన యిల్లును అమ్మివేశాడు. తను బాకీని తీర్చివేశాడు. తన చెల్లాయి కళ్యాణము మహా వైభవముగా జరిపించాడు. చాలా సంతోషించాడు. ఎంతో వుత్సాహముతో ఎంతో ఆనందముతో వారిని వూరికి పంపించాడు. తన చెల్లాయి లేనిది యింటిలో బిసురోమనివుంది. తన చెల్లాయితో కాలము వెళ్ళబుచ్చుకొనుచున్నాడు. తన చెల్లాయినుండి రెండు మూడు వుత్తరాలు వచ్చాయి. రాము ఎట్లాగో ఒక చిన్న వుద్యోగము ఆ వూరిలోనే సంపాదించుకున్నాడు. తన చిన్నచెల్లాయితో హాయిగా కాలము వెళ్ళబుచ్చుచున్నాడు.

దీపావళిపండుగకు తన చెల్లాయిని శేఖర్‌ని యింటికి పిలుచుకొని వచ్చుటకు కొన్ని ఫలహారాలు తయారుచేయించాడు. పిలుచుటకు బయలుదేరు సమయములో పోస్టుమేన్ ఒక వుత్తరము తెచ్చియిచ్చాడు. ఎంతో సంతోషముతో ఆకవరును చించాడు. తన చిన్న చెల్లాయి ఆనందముతో అన్న ప్రక్క నిలబడింది. రాము దానిలో రెండు, మూడు వాక్యాలు చదివాడో లేదో అట్లాగే కూర్చున్నాడు. ఇంతసేపు ఆనందముతో తొణికిసలాడుచున్న మోము వివర్ణమైంది. కనుకొలుకులు నీళ్ళతో నిండాయ్. పిచ్చిగా, వెఱ్ఱిగా అట్లాగే చూస్తున్నాడు. ఏమిటి అన్నయ్యా కవరును దగ్గర పెట్టుకొని కంట నీళ్లు పెట్టుకుంటావు? ఇటు యీ నేను చదువుతాను.

"ప్రియమైన స్నేహితునకు శేఖర్ వ్రాసుకొన్న లెటర్ మీ క్షేమములు తెలిపేది. నీవు వ్రాసినజాబు చేరినది. కాని నేను చాల విషమపరిస్థితిలో నున్నాను. అంటే డబ్బులేక, అన్నములేక కాదు. చెప్పరాని బాధతో తల్లడిల్లిపోతున్నాను. రామూ! మీకు చేసిన ద్రోహమునకు క్షమార్హుని కాను; నన్ను క్షమించమని ప్రార్థేయపడుచున్నాను. మీ చెల్లాయితో పండుగకు వస్తానని ఎంతో సంతోషముతో నీ మనస్సు విఱ్ఱవీగి వుంటుంది. సుశీల చెల్లాయి, బావ అక్క వస్తారని ఆనందముతో మురిసిపోయివుంటుంది, మీదగ్గరికి వచ్చుటకు కనీసము నాకొఱకు తన జీవితాన్నే పరిత్యాగముచేసే నా సుశీల దగ్గర వుండుటకుకూడ నోచుకోలేని నిర్భాగ్యుడ్ని, రాము! మాన

వుడు ఆనందమయమైన జీవితాన్ని కోరుతాడు, ఎన్నెన్నో ఆశలు పెట్టుకుంటాడు. సఫలీకృతుడు కావాలంటాడు. కాని విధి తారుమారు చేస్తాడు. అది ఆయనకు నైజగుణమేమో! రామూ! నీకు, సుశీలకు తీరనిద్రోహము చేసాను. సుశీల జీవితాన్ని మంటిపాలు చేసాను. నా చేతులారా! ఆమె పచ్చటి జీవితానికి సంకెళ్లు వేసాను. ఆ దృశ్యాన్ని చూడలేక మదనపడి కుమిలాను. మా జీవితాన్ని గురించి తియ్యని కలలుగన్నాము. మానవుడు ఒకటితలిస్తే, దైవము యింకొకటి తలుస్తాడు అనునది ఒక సూక్తిమాత్రమే అనుకున్నాను. కాని నా జీవితానికి సరిపోయింది. కళకళలాడుచు దేదీప్యమానముగా ప్రకాశించుచున్న జ్యోతిని ఆర్పి వెళ్తున్నానుగదూ! నేను యింకా బ్రతుకుతానని నామీద యింకా కోటి ఆశలు పెట్టుకొనివుంది. నామీదవున్న మమత, నామీదవున్న ప్రేమచేత, బుస్సుదమైన గుంటలో చిక్కుకొని నేను అవస్థపడుటకంటే, నన్ను రక్షించుటకు వస్తానని గబ, గబమని అడుగులు వేసుకుంటూ వేసుకుంటూ వస్తున్నది. నాదగ్గరికి వచ్చుటకు ఆ దేవునికికూడ భయముగావుంది. సుశీలమాత్రము యింకా జోరులో వస్తున్నది. సుశీలా! నామాటవిని ఒక అడుగుకూడ వేయవద్దు, వద్దు సుశీలా! వద్దు. నామాట ఒక్కసారివిను. నేను ఎట్లయినా పోతాను. కాని నీవుమాత్రము పదికాలాలపాటు బ్రతికి, నీఆశలు నెరవేర్చుకొని కావాలంటే మరలవచ్చి నన్ను కలుసుకో! నీకోసరము ఎదురుచూస్తూ వుంటాను.

ఎట్లాగో ఒదార్చి తిరిగివంపించాను, సుశీలను, విన్ను నిడనాడి ఏక్షణములో పంచభూతములలో కలసిపోతానో! నా కు మాత్రము తెలియదు

రామూ! నన్ను క్షమించి, నామాట నెరవేరుస్తానని ప్రమాణముచేసి చెప్పు. నేను కడపటిసారి నిన్ను కోరేదేమి టంటే సుశీలకు తగినవరుని చూచి వివాహము చెయ్. జీవితంలో ఏ అల్పసంతోషాన్ని అనుభవించని నిర్భాగ్యురాలు. ఈ మాటనే సుశీలను వేఱే ధోరణిలో అడిగాను. విముఖత్వమును తెలియపరచినది. నాకడపటిసారికోర్కెను నెరవేర్చి, నీచెల్లాయ్ జీవితాన్ని కళ, కళలాడునట్లు చెయి. ఈ వుత్తరము అవసరమై నప్పుడు సుశీలకు చూపించు, ఇది మనలోనిమాట.

ఇట్లు,
శేఖర్

రాము అయోమయస్థితిలోపడ్డాడు. చెప్పరాని బాధతో తల్లడిల్లిపోయాడు. అప్పుడే బయలుదేరాడు. శేఖర్ వూరు చేరాడు. వీధిమలుపు తిరిగాడోలేదో ఏడుపులు వినిపించు చున్నాయి, కడపటిసారి తనస్నేహితుని చూచాడు. చెల్లాయ్ బాధనుచూచి రాముహృదయము అల్లాడిపోయింది. దహన క్రియలు జరిగిపోయినాయి. భర్తపోయిన దిగులుతో సుశీల మంచముపట్టింది వొళ్ళు బాగుగాఅయినతర్వాత అత్తగారిమల

దగ్గర సెలవుతీసికొని, సుశీల అన్నతో పుట్టింటికి కన్నీళ్ళతో బయలుదేరింది; ఒకనాడు కళకళలాడుచున్న మోముతో అమ్మ గారింటినుంచి బయలుదేరివెళ్ళింది. కాని యీ నాడు యీ స్థితిలో యింటికి తిరిగివచ్చింది. యీనాడు ప్రపంచాన్ని చీకటి అలుముకోవచ్చు, రేపు వెన్నెలతో ముచ్చటగా, రమ్యముగా కన్పడ్తుంది. కాని సుశీలకు జీవితములో సుఖమనునదేలేదు. ఆ స్తిపాస్తులు ఆమెకు సౌఖ్యాన్ని యిస్తాయా! అది పిచ్చివారు అనుకొనేమాట; తను మధురజీవితానికి నోచుకోలేదు. ఆమె దినదినమునకు శుష్కించిపోవుచున్నది. ఆమెను చూచినప్పుడెల్ల చక్కటివెన్నెలను యిచ్చుచున్న చంద్రుడు చటుక్కున మబ్బుల లోనికి వెళ్ళిపోతున్నాడు. పిచ్చిదానివలె మారింది. ఏదేదో పిచ్చిగా కలవరిస్తూవుంటుంది.

ఇట్లాగ మూడునెలలు గడచిపోయాయి. రాము ధైర్య ము చెప్పుచు, చెల్లాయిని గారాబముగా చూచుచున్నాడు. ఒకసంవత్సరముకూడ దాటిపోయింది. రామునకు శేఖర్ వ్రాసిన వుత్తరములోని కడపటిమాట ప్రతిసారి తలపుకువస్తుంది. కాని తన చెల్లాయిని అడుగుటకు జంకుతున్నాడు, ఒకప్రక్క బాధ పడుచున్నాడు.

 

చెల్లాయ్! నామాట ఒకటివింటావా అమ్మా! నీస్థితి యిలావస్తుందని కలలోగూడ అనుకోలేదు. ఎన్నడూ ఎవరూ

ప్రాహించలేదు. మీరు ఎంతో సంతోషముతో ఆనందజగత్తులో విహరించాలని, యీ నయనములతో చూడాలని వాదించాను. అదే నామనస్సులో అనుకున్నాను. నీ జీవితము కళకళలాడు చుంటే దైవమునకు ఒప్పుకోలేను. నీ ఆశయాలు, నీఆశలు యింతటితో మరుగుపడవలసినదేనా! చూడు చెల్లాయ్! యీ నాడు నిన్ను కోరేది యేమిలేదమ్మా! నామాట వింటానంటె చెప్తాను. ఈసారి వివాహము చేసుకో! తప్పులేదు చెల్లాయ్. వితంతువు మరల వివాహము చేసుకోకూడదని ఎవరు చెప్పారు? ఆ మాటలు, ఆ ధర్మాలు వాళ్ళవరకే. సంఘములో ఏదో కుక్కమాదిరి మొరుగుతుందని, కాకిలాగ అరుస్తుందని భయపడవద్దు. చూడు చెల్లాయి మనభవిష్యత్తును మనము సుస్థిరముగా నిర్మించుకోవాలి? ఒకరికి భయపడవలసినపనిలేదు. వాళ్ళ బెదరింపులకు చలింపవలసిన పనిలేదు. నామాటవిని మరల వివాహము చేసుకోమ్మా!

అన్నయ్యా! ఒకరికి మనస్సుయిచ్చినతర్వాత, ఒకరికి దాసురాలుఅయ్యాక మరల యింకొకరికి నా హృదయంలో చోటులేదు, లోకులు నానామాటలు అంటారు. నన్ను క్షమించుఅన్నయ్యా యీవిషయములో, నేనుయీలాగే వుండి పోతాను. నీభర్తగారి కడపటికోర్కెను విలువచూపు చెల్లాయ్. ఆయనమాటను శిరసావహించి వివాహము చేసుకోమ్మా! చెల్లాయ్! నీకు ఓహాలోఅంటె ఇరవై సంవత్సరములుకూడ

లేదాయె; జీవితాంతమువరకు యిట్లాగె వుండిపోతావా! నీభర్త గారి ఆశయాన్ని నెరవేర్చవా! చెల్లాయ్. వితంతువు మరల పెండ్లి చేసుకొనుటతప్పా? మగవాడు భార్యచనిపోతే మరల పెండ్లి చేసుకోవచ్చు. అతనికి పూర్తిగా స్వాతంత్ర్యమువుంది. అందులో నీలాటి అణ్యాం, పుణ్యాం యెరుగనిస్త్రీలు వివాహము చేసుకొనుట తప్పని సంఘము భావిస్తుందని భయపడు చున్నావా! చెల్లాయ్!

భయపడకుచెల్లాయ్. నామాటవిని, నా స్నేహితుని మాటను గౌరవమునిచ్చి "వూ" అను. ఎట్లాగో ప్రయాసపడి మరల వివాహముచేస్తాను. చెల్లాయ్ "వూ"అను

ఆమాట అనవాచెల్లాయ్. ఒక్కసారి యిష్టమని చెప్పమ్మా. నీ భర్తగారి కడపటిమాటను యీ వుత్తరములో చదువుచెల్లాయ్.

అట్లాగే చేసుకుంటాను అన్నయ్యా! తనచెల్లాయి వేడి కన్నీటిబిందువులు అన్నకాళ్ళను పావనము చేస్తున్నాయి. ముద్దుగా, గారాబముగా సంతోషముతో చెల్లాయ్ తలనిము రుతూ, ఆనందముతో వుప్పొంగిపోయాడు. ఆ సంతోషాన్ని సుధాకరుడు వాళ్ళ యింటి కిటికీలనుండి తొంగిచూచాడు.

